సరస్వతీగ్రంథమండలి:
సంగీతానుబంధము: ౧

# మంగళహారతులు

శ్రీమతి కొచ్చెర్లకోట వీరలక్ష్మమ్మ




పబ్లిషర్సు: అగ్రిపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

సరస్వతీ గ్రంథమండలి:
సంగీతానుబంధము: ౧

# సంగీతహారతులు

శ్రీమతి కొచ్చర్లకోట వీరలక్ష్మమ్మ

పబ్లిషర్సు: అడ్డేపల్లి అండుకో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# మంగళహారతులు

## (విషయసూచిక)

# మంగళహారతులు

## 1

### శ్రీగణపతి ప్రార్థన

(గైకొనుము హారతి గౌరీ పాహి) వలె.

పల్లవి:— గైకొనుము - హారతి - గజాననా

అనుపల్లవి:— కరుణించి - గైకొనుమా - కైలాసావాసా,
కాంచిమంటి - నీదుకరుణా - జూపుమా ||గై||

1. మూషకవాహన - మోదకహస్తా
సర్వాంగహారతి - సంతసముతో గైకొనుమా
2. వాసిగ పినతల్లి - పురముననున్న - వరలుచు నుంటివి -
వర విఘ్నేశ్వర ||గై||

విఘ్ననివారణ - యిభరాజముఖా -
వీరలక్ష్మీసుత - పార్వతీసుతా|| ||గై||

## 2

### శ్రీసరస్వతీ ప్రార్థన

(అహ యిదేమది ఆశ్చర్యమైనది) వలె.

ప|| జయహారతీయిదే - వాణిసరస్వతీ,

అ|| జనని - నీపదంబుసదా - సేవయొనగుమా ||జ||

1. లోకపావనీ - ముల్లోకమోహినీ -
శారదాంబ - నిన్ను - నేను - సన్నుతించెదా ||జ||
2. కమలాసనునిరాణి - కరుణించి బ్రోవుమా,
పుష్పములతో పూజసేతు - పుస్తకపాణి ||జ||

భక్తితో పరమాత్మ - నీవని - భరతుడు - పట్టిసేవించిన ॥నీ॥

1. ఆనంద మోహన - ఆశ్రితపాలన - దివ్యాత్మా
అనంతరూప - అహల్యను - ఉద్ధరించిన ॥నీ॥

2. భావదీయపాదముల్ - భక్తితో సేవించెదన్
భక్తవత్సల - భానుతేజా - పవమానసుతుడు బట్టిన ॥నీ॥

3. రఘుకులావంశోద్భవా - రావణాసంహారకా
పితృవాక్యము సమ్మతించి - పత్నితో కానలకు నడచిన ॥నీ॥

4. గరుడగమనా శ్రీధరా - కలుషసంహారకా
భూమి సూనుడు మిగులడిగి - బలిని పాతాళంబు కణచిన ॥నీ॥

5. మంగళస్వరూపక - మోహనాకారక
విశ్వపాలక - పతితపావనగుణా - పరమభక్తి మదిని నమ్మిన ॥నీ॥

# 5

(శ్రీగో - పాల - పాహి ముకుంద కృష్ణ - పాహి) వలె.

। శ్రీ - రామ - చంద్రా - మంగాళ - హారతి దే

॥ మంగా - ళ - హారతి దే - మాధవ రామ గొనుమా ॥శ్రీ॥

1. శ్రీలక్ష్మి - హృదయ లోలా - శృంగార మోహన రామా
కరుణించుమా - కర్పూర హారతి దే ॥శ్రీ॥

2. రఘువంశోద్ధారా - రావణసంహారా
రాజీవలోచన రామా - రత్నాలహారతి దే ॥శ్రీ॥

3. అమితవిక్రమాయ - ఆనందసద్గుణమూర్తి
అగ్రజాయ - రామా - హారతి యిదె గైకొనుమా ॥శ్రీ॥

4. విజయపరిపాలా - వీరలక్ష్మిసన్నుత రామా
విజయలక్ష్మితో - విజయహారతి దె గొనుమా ॥శ్రీ॥

## 8

(పరిమళ రంగపతే-మాం-పాలయ) వలె.

ప॥ మంగళా - హార - తీ - దే - వారా - ములకూ

అ॥ మంగళాహారతిదే - మా రఘునందనునకూ ॥మం॥

1. మునియాగమును గాచి - మునిపత్నిని బ్రోచి
కరుణాత్ముడౌ మా - కళ్యాణరాములకూ ॥మం॥

2. శివధనుస్సును ద్రుంచి - జనకుని మెప్పించి
సీతను పెండ్లాడినా మా - శ్రీరామచంద్రులకూ ॥మం॥

3. వాలిని వధియించి - వనచర రాజ్యంబు
సుగ్రీవు కొసగిన మా - సుగుణాకరునకూ ॥మం॥

4. అనిలతనయునకు - అభయము నొసంగిన
ఆది అంతములులేని మా - అనంతరూపునకూ ॥మం॥

5. సీతకొఱకు ఆ - సేతువూ బంధించి
జయముగొన్న మా - జగదుద్ధారునకూ ॥మం॥

6. పితృవాక్యము పాలించి - పురము కేతెంచిన
పరమాత్మరాములకు - పతి సీతమ్మకూ ॥మం॥

7. రామదాసు నిల - రక్షించిన మా
రఘురామచంద్రునకు - రాక్షసహరునకూ ॥మం॥

8. భద్రాద్రిపురవాసుడు - పరమమంగళమూర్తి
భవ్యస్వభావుడు - వీరలక్ష్మీసన్నుతునకూ ॥మం॥

## 9

(బంతు-లాడ-వేగ-రా రా- బాలా గోపాలకృష్ణ) వలె.

ప॥ హారతినీ - గైకొనుమా - రామా - కోదండరామా

అ॥ అతివా సీతమ్మతో లక్ష్మణ - హనుమంతులతో ॥హా॥

1. తాపసరక్షక - తాటకాసంహార
మారీచసుబాహుల మద - మడంచిన రామా ||హా||
2. రఘువంశ భూషణా - రక్షించుము రాజువు
రాతి నాతిగ జేసి - ఖ్యాతినందిన రామా ||హా||
3. జనకపుత్రిని పెండ్లాడి - జనులు సమస్తులతో
అయోధ్యకే తెంచిన - అనంతరఘురామా ||హా||
4. సాకేతపురనివాస - సాధుహృదయనివాస
వీరలక్ష్మీసన్నుత - విజయలక్ష్మీతో రామా ||హా||

# 10

(శ్రీవినాయక ప్రభో నమో నమో నమో) వలె.

ప|| స్వీకరింపుము హారతి - సీతామనోహర
అ|| సీతామనోహార - శృంగార శ్రీహరీ ||స్వీ||
1. తుంబురగానవిలోలా - తులసి - వన - మాలీ
నారదాదిసన్నుత - నగుమోమునకు హారతి ||స్వీ||
2. గరుడగమన - కలుషహరణ - గజరాజపాలనా
గౌతమసతి నేలిన - కరుణానిధే హరీ ||స్వీ||
3. చంద్రవదన - శాంత - దాంత - సద్గుణావనా
పన్నగశాయి మము - పాలింపుము హరీ ||స్వీ||
4. భద్రాచలపురనివాస - పావనమూర్తి
వీరలక్ష్మీసన్నుత - వినుతజనా - హరీ ||స్వీ||

# 11

(పాహిమాం వరగుణశీలా యనిపిలిచిన పలుకవదేలా) వలె.

ప|| జనకాత్మజాప్రియ రామా - జయహారతి యిదె గైకొనుమా
అ|| నారదవందిత చరణా - నవమన్మథాకార

దశరథనందన రామా - దయతో దర్శనమివ్వగా ||జ||

1. ఆది - అంతములేని - అద్భుతమైన జ్యోతి
అచ్యుత మాధవ రామా - ఆనందస్వరూపమూర్తి - ఆదరించి
హారతిగొనుమా ||జ||

2. తులసిదాసపోషా - తుంబురనారదవినోదా - సీతాప్రాణలోలా
శృంగార మోహనరామా - స్వీకరించు హారతి వేళ ||జ||

3. పరమాత్మ - పన్నగశాయి - పాలింపు దశావతార
వీరలక్ష్మీ సన్నుత రామా - విజయలక్ష్మితో హారతిగొనుమా ||జ||

# 12

(హారతి యివ్వరే అంబ పాదములకి) వలె.

ప|| మంగళహారతి దే - మాధవ - రాములకు

అ|| మంగళధాములకు - మహాలక్ష్మీ సీతకు ||మం||

1. పచ్చలహారతి - పంకజనాభునకు
పాటాలు పాడుచు - భక్తితో యివ్వరే ||మం||

2. రత్నాలహారతి - రాజీవనేత్రునకు
రత్నధాముునకు - రఘువంశచంద్రునకు ||మం||

3. ముత్యాలహారతి - మునిజనసన్నుతునకు
వీరలక్ష్మీసన్నుతునకు - విశ్వమోహనునకు ||మం||

# 13

(వాసుదేవా జాలిలేదా - వనమాలీ - బ్రోవరావా) వలె.

ప|| కర్పూరంపు హారతి దే - గైకొనుము - శ్రీరామచంద్ర

అ|| కరుణాలోలా - సుగుణశీలా - సుందరా - సుకుమార ధీరా ||క||

1. బాలుడా ప్రహ్లాద ధ్రువులకు - ప్రార్థనతో - ప్రత్యక్షమైతివి

వరమపురుషా - భక్తపాలా - వన్నగాశయన నీకు ॥క॥

2. శబరియెంగిలి - ఫలము చేకొని - జడపదనపీ - శబరి కొనగవె

మేలొనంగినవాడవని నిను - చాలగా మది నమ్మియుంటిని ॥క॥

3. వినతగుణసౌందర్యలోలా - వికసనాయనాథ

విశ్వపాలా వీరలక్ష్మీసన్నుతం పాలించి బ్రోవుమా ॥క॥

# 14

(బంతులాడేనూ రావేరా - పట్టాభిరామా) వలె.

ప॥ మంగళహారతి యిచ్చేరా - శ్రీ రామా గొనుమా

అ॥ శ్రీలక్ష్మీమనోహర - శ్రితజనమందార

చిన్మయరూప - శ్రీవిజయమూర్తి నీకు ॥మం॥

1. కారుణ్యసాగర కల్యాణగుణ ... -

కమలబాంధవ హరీ - కనకాంబరధరా నీకు ॥మం॥

2. కౌసల్యవరపుత్ర - కమలపత్రనేత్ర

కూరిమితో బ్రోవుమా - కమలజునినుత నీకు ॥మం॥

3. నిత్య నిరామయ - నిర్మలానందమూర్తి

నిరుపమగాత్ర - నీలవర్ణ - రామా - నీకు ॥మం॥

4. విశ్వంబరాధర - విజయసంరక్షకా

వీరలక్ష్మీసన్నుత - విజయలక్ష్మితో - రామ - నీకు ॥మం॥

# 15

(ఆహా - హా యీపెండ్లికొమరుని ఎన్నార్యుడెకశరయా) వలె.

ప॥ జయ - జయ - శ్రీ రఘురామా - జయహారతి - దయతో గొనుమా

అ॥ జయహారతి దయతో గొనుమా - జనకాపుత్రి - జానకితో ॥జ॥

1. పద్మదళవిశాలలోచన - పరమాత్మ శ్రీ కేశవా

వచ్చె కర్పూరహారతీ - భూమి సీతతో గై కొనవమ్మా ||జ||

2. విశ్వమంత నిండియుంటివి - వీరాధివీరుడవై

వీరలక్ష్మీహృదయనివాసా - వేడ్కతో వే వేగా రా ||జ||

## 15

(కాలహరణమేలరా హరె సీతారామ) వలె.

ప|| మంగళాహారతిదే - గొనుమా శ్రీ - రామ - కృష్ణా - జయ

అ|| మంగళాహారతిగొనుమా - మధురాపురీనివాసా ||మం||

1. తులసీదళంబులచే - శృంగారముగా పూజింతు

భవదీయపాదభక్తి - నిరతము నా కొసగుమయ్యా ||మం||

2. యాదవకులవంశతిలక - యశోదానందతనయ

యమునావిహార హరీ - రేపల యీ జాలమేలా ||మం||

3. పద్మమాలాధరా - పరమ మంగళమూర్తి

తుంబురగానవిలోలా - సుందరసుగుణాలంకారా ||మం||

4. సర్వేశ్వర సర్వాధార - శరణాగతవత్సలాయ

సత్యధర్మవిక్రమాయ - వీరలక్ష్మీసన్నుత హరీ ||మం||

## 16

(రాజ - గోపాలా - జాలమేలా) వలె.

ప|| రఘురామ - నీకిదే - హారతీ

అ|| రమణిసీతమ్మతో - రత్నాలహారతీ ||ర||

1. యాగసంరక్షణ - యోగిహృదయవాస

తాటకసంహార - తపసివేషధారీ

దయతోను బ్రోవుమా - ధరణిజనావనా ||ర||

2. జగన్మోహన - జనకాత్మజాప్రియ
జయ రఘురామా - జలజోద్భవాసా వి
జయూపరివాలా - వీరలక్ష్మీనుత ॥జ॥

# 17

(బంతులాడరావే - బాలికామణిరో - ఇంతియక్కిణి నాతో) వలె.

ప॥ హారతి - గైకొనుమా - అతివసీతతో నీ

అ॥ క్షీరాబ్ధిశయనా - శృంగార శ్రీరామా ॥హా॥

1. కోదండరామా నీ - కోమలపదములకు
కొనుమిదె - హారతి - కూరిమితో కృపజూడు ॥హా॥

2. రాక్షసంహార - రఘుకులవర్ధనా
శశిధరపూజిత - శంఖచక్రధారీ ॥హా॥

3. వాలినీ వధియించి - వనచరరాజ్యమెల్ల
సుగ్రీవు కొసగీన - సుగుణాభూషణ రామా ॥హా॥

4. భద్రాద్రినివాసా - పరమమంగళనామ
వీరలక్ష్మీనుత - విజయలక్ష్మీతోను ॥హా॥

# 18

(ఎవ్వారికోరి - బాలలార - ఎటిగింపుమా - రాజుతోను) వలె.

ప॥ హారతిదే - గైకొనుమా - రామా కోదండరామా

అ॥ అతివసీతమ్మతో - లక్ష్మణహనుమంతులతో ॥హా॥

1. పరమపురుష హరీ - ప్రాపుగోరి యుంటినిరా
భవదీయపాదభక్తి - ప్రేమతో నా కొసగుమా ॥హా॥

2. చంద్రవదనా - హరీ - చేపట్టి రక్షింపుమా
శాంతస్వరూపక నీ - చరణములే నమ్మితిని ॥హా॥

3. కోటిసూర్యప్రకాశ - కోదండరఘురామ
కోసలరాజతనయా నీకు - కోమలన్యాదయా హరి ||హ||
4. పద్మబాంధవప్రియు - పరమాత్మ శ్రీకరుణాకర
ప్రహ్లాదవరదా - భూప - పరమశుభపద్మాకర ||హ||
5. వైకుంఠ శ్రీరామచంద్ర - వామాంక లక్ష్మీధర
వీరలక్ష్మీసన్నుత - విజయలక్ష్మితోగూడి ||హ||

## 19

(శ్రీరాగము - దేవాప్రభో - పాలయమాం) వలె.

ప|| జయహారతి దేగొనుమా - జానకిలోలా
అ|| కరుణాకరా - రాఘవా ||జ||
1. పరమపురుష - భక్తపాలన
సుందరాంగ - సుగుణభూషణ
ఆదిదేవా - అనంతరూప - అతివతోనుకూడి ||జ||
2. నీలవర్ణ - నిత్యమంగళ - సారసాక్ష - సన్నుతాంగ
సత్యధర్మపరాయణాయ - సతతమూ నిను వేడుచుంటి ||జ||
3. విశ్వరూపక - విజయరక్షక - వినుతగుణసౌందర్యలోలా
వీరలక్ష్మిహృదయవాస - విజయలక్ష్మితోనుగూడి ||జ||

## 20

(భవానీ - భక్తపోషణీ - ముక్తిదాయనీ - శక్తిరూపిణీ) వలె.

ప|| శ్రీరామా - జయహారతి - గొనుమా
అ|| సీతామహాలక్ష్మితో - శృంగార మోహనా ||శ్రీ||
1. పరమపురుష - పావనచరిత - పన్నగశాయి - పరమాత్మ
కారుణ్యసాగర - కాంత శ్రీలక్ష్మితో - కరుణింపుమా వేగ||శ్రీ||

2. సుప్రీతాయ - వాసుదేవాయ - వందనమిదిగో సుమానసమాలీ
వైకుంఠనాయకా - వారధిబంధనా - [illegible]లక్ష్మితో ॥శ్రీ॥

3. సరసిజనాభ - సర్వాధార - శాంతిదాత - సత్యేశా
గజరాజపరిపాలా - కల్యాణరాఘవా - వీరలక్ష్మీసన్నుత ॥శ్రీ॥

## 21

(మధురాపురిలో చల్లనమ్మబోదు - దారివిడుము కృష్ణా) వలె.

ప॥ జయ - జయ - రఘుకుల - జగదభిరామా
అ॥ జయ - జయ - హారతి - జగద్ధాతా ॥జ॥

1. సనకసనందన - సన్మునివందిత
కోదండరామా - కొనుమిదే - హారతిదే ॥కొ॥
2. తాటకిమర్దనా - తాపసరక్షణ - దశరథపుత్ర
పరమపవిత్రా - పాలింపుమురా - పావననామా ॥జ॥
3. పద్మపత్రవిశాలలోచన - పక్షీంద్రవాహనా
పరమాత్మమురారి - పచ్చకర్పూర పరిమళహారతి ॥జ॥
4. మునిమానసహార - మురళీమోహనా
వైకుంఠవాసా - వటపత్రశాయీ - వనమాలాధర -
కరుణాసాగర ॥జ॥
5. దీనబాంధవా - పార్థసారథీ - దివ్యాంబరధర
దీపహారతిదే - దేవాదిదేవా - వీరలక్ష్మీనుతా ॥జ॥

## 22

(మునీంద్ర - వీరవరా - తెలుపుమా) వలె.

ప॥ హారతిగైకొనుమా - సీతాపతే
అ॥ శ్రితజనపాలన - శ్రీనివాసమూర్తి ॥హా॥

1. మాణిక్యమణి - సీతాంగనతో - మారసుందర - సుకు
మారశరీరా - మాధవ శ్రీధర - మంగళరూపా ||హా||
2. కర్పూరహారతి - కమలసంభవితో - కౌస్తుభమణినిచు
కనకాంబరధర - కనికరముంచి - కరుణాకోవేగా ||హా||
3. మోహినివేష - మోక్షప్రదాయక - బ్రోచుచునుంటివి
మునిజనపూజిత - ముదమునసీతతో - మురియుచు- ముత్యాల||హా||
4. విశ్వంభరధర - వినుతగుణాకర - విజయలక్ష్మితో
వేదాంతవేద్య - వేడుకతోటి - వీరలక్ష్మియిచ్చే ||హా||

## 23

(బాలాజీ- తానీవు- బాలపాలిని- జూడుమా) వలె.

ప|| హారతిగొను - రామచంద్రా - అంబుజదళలోచనా
అ|| హారతీ జయ - హారతీశుభ - అతివసీతతో గైకొనుమా ||హా||
1. నిరుపమానసౌందర్యమూర్తి - నిత్యమంగళాలయా
నీలమేఘవర్ణ నీకు - నిత్యహారతి గొనుమిదే ||హా||
2. పరమపురుష - పన్నగాధిప - పచ్చకర్పూరహారతీ
పరమపావన - పద్మబాంధవ - పణతిసీతాభామతో ||హా||
3. దేవదేవా - దీనబాంధవ - దివ్యహారతి గొనుమిదే
వీరలక్ష్మిసన్నుత శ్రీ - విజయలక్ష్మి మనోహరా ||హా||

## 24

(పూజను సేయారారే - పుండరీకాక్షునకు) వలె.

ప|| హారతీ - యిచ్చేద - శ్రీరఘురాములకు
అ|| అతివ సీతమ్మకు - అనుజ లక్ష్మణ్ణకు ||హా||
1. ప్రత్యగభిన్నాత్మ - పరమాత్మశౌరికి

భరతశత్రుఘ్నులకు - పవమానసుతసహితునకు ||హా||
2. కుశలవులజనకునకు - కుసుమశరారివినుతునకు
సురసామిత్రునకు - సర్వస్వరూపునకు ||హా||
3. శ్యామలాంగునకు - శాంతిస్వరూపునకు
వీరలక్ష్మీసన్నుతునకు - విజయసంరక్షకునకు ||హా||

# 25

(ఆటలాడుకోరా— నాముద్దులమాట గదరా) వలె.

ప|| జయజయ - హారతిదే గొనుమా - శ్రీరామా - సీతాదేవితో
అ|| జయజయ - ధీర- జయజగదీశ్వర- రఘుకులతిలక- రఘురామా||జ||
1. పద్మపత్రవిశాలలోచనా- పద్మనాభ పరాత్పర కేశవ
పతితపావన - పన్నగశాయి- పరమపురుష- దయాకర- శుభకర||జ||
2. నీలవర్ణ నీనవ్వుమోమునకు - నీరాజనమిదె - నీరజేక్షణా
నిరుపమానసౌందర్య శ్రీరామా - నిఖిలలోకపూజిత-శుభచరిత||జ||
3. గౌతమపత్నిని - కరుణతో బ్రోచిన - కౌసల్యావరపుత్రరత్నమా
తారకనామా-దశరథతనయా-దాసురాలగు వీరలక్ష్మియిచ్చే||జ||

# 26

(ఇభరాజవరదా— పార్వతీపరమేశనందనా) వలె.

ప|| కర్పూరహారతి - గైకొనుమా - సీతామనోహర
అ|| సీతామనోహరా - సృష్టిసంరక్షకా ||క||
1. శరణన్నవిభీ - షణునిగాచిన - శాంతస్వరూపకా
శ్యామలవర్ణాఢ్య - సేతుబంధనా - ధీరా ||క||
2. భక్తవరుల నెందరినో - పావనులజేసితివి
పాండవాపరిపాలా - పక్షీంద్రవాహనా ||క||

3. వినుతగుణసౌందర్యలోలా - విజితశతకోటికామా
విన్నపము చాలింపు - వీరలక్ష్మీ సమ్మత ||క||

## 27

(నేడు మనసుంచరము గూడి పాడుదము పరమేశుని) వలె.

ప|| రామచంద్రా నీకు జయహారతిచ్చెద గైకొనుమా
అ|| రమ్యగుణ - రఘురామచంద్రా - రమణిసీతతో గైకొనుమిదే ||రా||

1. కరుణాలోలా - సుగుణశీలా - భక్తపాలన - శుభకర
భామసీతతో - గైకొనుమా - పరిమళహారతి దే ||రా||

2. నిత్యమంగళ - నిర్వికార - నిఖిలలోకపూజిత
దీనజనమందార - వేగా - దివ్యహారతి గొనుమిదే ||రా||

3. విశ్వపాలన - వితరణాగుణ - వీరలక్ష్మీ సన్నుత
మంగళాంగ - మదనమోహన - మారుతాత్మజప్రియా ||రా||

## 28

(భజనసేయుదాము - రారమ్మా - భద్రాద్రిరామా) వలె.

ప|| కర్పూరహారతీ - యిచ్చెద - గైకొనుమా - రామా
అ|| శ్రీకరుణాకర - భక్తపరాత్పర - శ్రీలక్ష్మీమనోహర -
శ్రీరఘురామా ||క||

1. అండజవాహన - అసురసంహారక
అయోధ్యపురీపరిపాలా - అనంతపద్మనాభా ||క||

2. శంఖచక్రాధరా - దీనదయాపర - వీరలక్ష్మీ
సన్నుత - విజయాంబరధరా - విజయజయలక్ష్మీకి. ||క||

## 29

(రామ నను కావవా — ప్రేమతోడాటరా) వలె.

ప॥ కొనుమిదె - హారతిదే - రామా - కోదండరామా

అ॥ కోమలీ - సీ - త - తో - కోసలనాయకా - ఆ, ఆ, ఆ ॥కొ॥

1. రఘువంశపావనా - రాక్షససంహారా
రమణీమోహనాకార - రక్షించిబ్రోవరా ఆ, ఆ, ఆ ॥కొ॥

2. మునిజనసన్నుతా - ముల్లోకపూజితా
సారసాదళలోచనా - సత్యపరిపాలనా ఆ, ఆ, ఆ ॥కొ॥

3. భవదీయపాదసేవా - భక్తి నా కొసగుమా
నిన్నే మది నమ్మితి నే - నీరజనాభా హరీ ఇ, ఇ, ఇ ॥కొ॥

4. వైకుంఠపురనివాసా- వామాంకలక్ష్మీధర
వనమాలికాధరా - వసుధాసంరక్షకా ఆ, ఆ, ఆ ॥కొ॥

5. దేవదేవా హరీ - దివ్యమంగళరూపా
వీరలక్ష్మీసన్నుత - విజయలక్ష్మీదేవితో ఆ, ఆ, ఆ ॥కొ॥

## 30

(గైకొను హారతి— గౌరీ— పాహి) వలె.

ప॥ హారతీ - ఇదే - గొనుమా - జానకీపతే

అ॥ కరుణాతో - గైకొనుమా - కల్యాణరామా
కందర్పజనక - సుందరవదనా ॥హా॥

1. నిత్యమునీపాదసేవనొసగుమా-నీలవర్ణరామా-జాలమేలరా ॥హా॥

2. పరమదయాకర - పార్థసారథీ - పాలించి బ్రోవుమా -
పట్టాభిరామా ॥హా॥

3. దిక్కునీవయనీ మదినినమ్మితి-దివ్యలోకవాసా- దీన[illegible] ॥హా॥

4. ధరణీశ్వర మమ్ము - దయజూడుమా వీరలక్ష్మీనుత -
పూజితా రామ ॥హా॥

# 31

(చిన్నవాడ — నన్నేలుకోర — కన్నె ప్రాయము నంటిరిరా) వలె.

ప॥ రామచంద్ర - నీకు - జయహారతిస్తును - గైకొనుమా
అ॥ రమణిసీతాదేవితోను — రమ్యగుణ - రఘురామచంద్రా ॥రా॥
1. రాతినీ - నాతిగజేసి - ఖ్యాతినిబొందినరామ
రఘుకులావంశవర్ధన - రక్షణాధామ బ్రోవుమురా ॥రా॥
2. మంగళాలయ - మదనమోహన - మారుతాత్మజప్రియహారీ
మనవి - గొనుమా - మానరక్షక - మాధవా
మమ్ముబ్రోవుమురా ॥రా॥
3. శబరియెంగిలిఫలము చేకొని - చెడనిపదవీ - శబరికొసగవె
సేతుబంధన - శాంతమూర్తి - సేవయొసగి బ్రోవుమురా ॥రా॥
4. దశరథాత్మజ - ధరణిజాపతే - దేవదేవా - దీనబంధూ
వీరలక్ష్మీపూజితా ప్రభో - విశ్వామిత్రుని యాగరక్షక ॥రా॥

# 32

(గోపాలా - కృష్ణునీ - గంటిరా — ఎంద్రైనాగానీ) వలె.

ప॥ హారతీ - యిచ్చేద - రాములకు - ఆదిలక్ష్మీసీతకు
అ॥ అంతటానిండియుండిన - ఆదిమధ్యాంతములులేని
ఆదిలక్ష్మిసీతతోను - అవతరించిన రాములకు ॥హా॥
1. తాటకిని - మర్దించి - తపసీయాగముగాచి
శివధనస్సునుత్రుంచి - సీతనూపెండ్లాడిన - శ్రీరాములకు ॥హా॥

2. దండకారణ్యములకు - వెడలి - దశకంఠునీ - బరిమార్చి
ధరణిజను - చేకొని - తమ్మునితో - అయోధ్యచేరిన -
శ్రీరామునకు ||హా||

3. పవమానతనయునితో - భరతశత్రుఘ్నులతో
పక్కనులక్ష్మణసీతలతో - పట్టాభిషేక మొందిన
శ్రీరామునకు ||హా||

4. నీలమేఘవర్ణహారీ - నిరుపమసౌందర్యనిధీ
వీరలక్ష్మీసన్నుత - శ్రీ - వీరాధివీరుడు - శ్రీరాములకు ||హా||

## 33

(ఏమిర - లక్ష్మణ - ఏమిర - నాసీత) వలె.

ప|| హారతిగొనుమా - శ్రీరఘురామా
అ|| శ్రీకరుణాకరా - సీతామనోహర ||హా||

1 తాటకిమర్దన - దీనజనావన - దశరథనందన - దివ్య
దయాగుణా ||హా||

2. గౌతమపత్నిని - కరుణతో బ్రోచిన - కరిరాజపాలా -
కారుణ్యలోలా ||హా||

3. శివునివిల్లు విరచి - జనకుని మెప్పించి - సీతను
వరించిన శ్రీరామచంద్ర ||హా||

4. మంగళనామా - మాధవరామా - విజయలక్ష్మితో
గొనుమా వీరలక్ష్మియిచ్చే - ||హా||

## 34

(కందు - కందు - నీమన్న - కైవిడుమరే(క్ష్ణ) వలె.

ప|| హారతీ - గై - కొను - మా - కో - దం - డ - రామయ్యా
అ|| అనా - థ - నాథా - ఆర్త - శరణ్యా ||హా||

1. సీతామనోహరా - సృష్టిసంరక్షకా - సుకుమారశరీరా -
సుందరరూపా ||హ||
2. సరసిజాదళనేత్ర - శాంతస్వరూప
సంతతము - నీపదసేవ - యొసగుమా ||హ||
3. మారుతాత్మజప్రియా - మానసంరక్షకా
మంగళా మొసగుమా - మానసహారా ||హ||
4. కోటిసూర్యప్రకాశా - కోదండరఘురామా
కోమలహృదయా నిన్ - కొనియాడతరమా ||హ||
5. దేవదేవహారీ - దివ్యలోకావాస
విజయలక్ష్మితో గొనుమా - వీరలక్ష్మియిచ్చె ||హ||

# 35

(మంగళాలయ - మగువాక - బ్రోవుమయా) వలె.

ప|| జానకీరమణ - జయహారతిదే - గొనుము

అ|| జయహారతి జే గొనుమా - జగదాధారా ||జ||

1. కారుణ్యాలోలా - కరిరాజపాలా - కర్పూరహారతిదే
శ్రీరఘురామా - శ్రీలక్ష్మితో గొనుమా ||జ||
2. అవనీజలోలా - అమరేంద్రవినుత - రత్నాలహారతిదే
రాఘవరామా - రక్షించి బ్రోవుమయా ||జ||
3. విశ్వమోహన - వీరాధివీర - వీరలక్ష్మిసన్నుత
నీరజనేత్రా - నీరాంజనమిదే - గొనుమా ||జ||

# 36

(పెండ్లాడుమీ — చెలియా — ఆచెలువుడు నీప్రాణనాథునితో నేడు)వలె.

ప|| కర్పూరంపుహారతీ - గొనుమా - ఓ - కౌసల్యసుకుమార
కాంత - లక్ష్మితోడ

అ॥ కారుణ్యసాగర - కనకాంబరాధర
కాంత జానకిగూడి - గైకొనుమా వేగ ॥క॥

1. మానిజనావన - మానామము నీకింత
మంగళహారతి - మగువాలు తెస్త్రిరి ॥క॥

2. ఎంతో వేడుచున్న - వందనము నీకింత
పరిమళహారతి - పణతి - సీతతోగూడి ॥క॥

3. విశ్వంబరాధర - వినుతగుణాకర
విజయలక్ష్మితోగూడి - వీరలక్ష్మి యిచ్చే ॥జ॥

# 37

(ఎవ్వరిదానవే - బాలా - నీటులాడితనంబు - సేయుచేలా) వలె.

ప॥ నీలవర్ణ - శ్రీరామా - నిరుపమసౌందర్యమూర్తి

అ॥ నీనవ్వు మోమునకు - నీరాజనంబిదే
కరుణతో గైకొనుమా - కాంత - శ్రీలక్ష్మితో ॥నీ॥

1. అహల్యాశాపవిమోచన - అంబుధిబంధన రామా
ఆదరింపుమయ్యా - అవనీజనాధార - తారకనామము
దయతోను బ్రోవుమా ॥నీ॥

2. కమలదళనేత్ర - రామ - కరుణతో జూడుమమ్మ
కరినీ రక్షించినా - గరుడగమనహరీ - మంగళరూప -
మానవనాయక ॥నీ॥

3. వైకుంఠనాయక - రామా - వందనమిదే గైకొనుమా
లోపము లెంచకుమ - లోకసంరక్షక - పద్మమాలాధర -
పరమాత్మ కేశవ ॥నీ॥

4. వినుతిగుణాకర - రామా - విజయలక్ష్మిదేవితోను

వీరలక్ష్మి యిచ్చే - విజయహారతి
వనమాలికాభరణ - వనచరపోష ॥సీ॥

## 38

(పూజచేతాము - రారమ్మా - యీవేళ - మహాలక్ష్మికి) వలె.

ప॥ హారతి - ఇవ్వ - రారమ్మా - సీతారాములకు
అ॥ హారతి - ఇవ్వరారే - అతివలెల్లారు - మీరు
నీరజానేత్రునకు - నిత్యమంగళజయ ॥హా॥

1. బంగారుపళ్ళెములో - పచ్చకర్పూరంపు
భామా సీతమ్మకు - పరమాత్మ రాములకు ॥హా॥

2. కమనీయగాత్రునకు - కౌసల్యాతనయునకు
కరిరాజవరదునకు - కారుణ్యాలోలునకు ॥హా॥

3. పరమాపురుషునకు - భద్రాద్రివాసునకు
భక్తుల బ్రోచేటి - వీర - లక్ష్మిసన్నుతునకు ॥హా॥

## 39

(మాఅన్నకుమారునకు - చిన్నిమేనల్లునకు - మంగళమని పాడరే) వలె.

ప॥ మంగళహారతిదే - ఘనశ్రీరామచంద్రులకు - సీతామహాలక్ష్మికి
అ॥ తాటకిని మర్దించి - తపసియాగము కాచి
మన్ననలనొందిన - మా రామచంద్రునకు ॥మం॥

1. రాతి నాతిగజేసి - ఖ్యాతిని జెందిన
రాక్షసహారునకు - రఘువంశ చంద్రునకు ॥మం॥

2. హరునివిల్లు విఱిచి - అతివను పెండ్లాడి
అయోధ్య జేరిన - అనంత రామునకు ॥మం॥

3. విశ్వమునంతాను - కుక్షినినింపిన
వీరాధివీరునకు - వీరలక్ష్మీనన్నుతునకు ||మం||

# 40

(ఆనందమే -- రామభజనా — గోవిందనామస్మరణా) వలె.

ప|| కరుణింపుమా — జయ శ్యామా — కర్పూరహారతి దే
అ|| కారుణ్యసాగర — రామా — శాంతా — సీతాలోలుండ ||క||
1. పక్షీంద్రవాహన — హనుమ — పాలింపుము — దశావతార
పరమాత్మ — జానకిలోలా — భవభయదూర రామా ||క||
2. వేదావేదాంత వేద్య — వేడుచున్నంటి — నెంతో
నీలవర్ణ — జాగేలా — నిన్నే నమ్మితి శ్రీరామా ||క||
3. రాతి నాతిగజేసి — రక్షించిన — రఘువీరా
రఘువంశరత్నదీప — రక్షింపుమా — శ్రీరామా ||క||
4. సనకసనందనులు — సన్నుతించిరా — శ్రీహరి
సనాతనా — సర్వేశా — వీరలక్ష్మీ — సన్నుత శ్రీరామా ||క||

# 41

(రమారమణ — గొనుమా — జయహారతిదే) వలె.

ప|| హారతి—గైకొనుమా—శ్రీరఘురామా—దేగొనుమా—జయ
అ|| మందరగిరిధార — మణిభూషణాకర
మగువ శ్రీలక్ష్మీతో — మహోన్నతావతారుడ ||హా||
1. పరమపావనమూర్తి — భవభయరహితుడ
కూరిమితో — కృపజూపు — కూర్మావతారుడ ||హా||
2. వనమాలికాధరణ — వసుధానందరక్షక
వైకుంఠనాయక — వరహావతారుడ ||హా||



3. నారదవందిత — నందగోపకుమార
[illegible] - గినె [illegible] — నరసింహావతారుడ ||హా||

4 వటపత్రశయనుడు — వర్ణింప నశక్యమౌ నిన్
వందనంబులు గొనుము — వామనావతారుడ ||హా||

5. పరశురామ (శ్రీ)రామ — సహస్రభుజాలాధర
పాలించి — బ్రోవుమా — భార్గవతారుడ ||హా||

6. రఘువంశపావన — రాక్షససంహార
రక్షింపవయ్య మమ్ము — రామావతారుడ ||హా||

7. కాళింగమర్దన — కంసాసంహారక
కృపతో బ్రోవుము — కృష్ణావతారుడ ||హా||

8. బృందావనాలోలా — పుండరీకాక్షుడ — నీ
బుద్ధిలెన్నగవశమ -- బుద్ధావతారుడ ||హా||

9. కందర్పసుందర — ఖడ్గధారి హరి
కరుణింపుమా — మమ్ము — కలికావతారుడ ||హా||

10. విష్ణుస్వరూపుడ — అవతారపురుషుడ
శ్రీలక్ష్మియిచ్చే — విజయాజయమంగళా ||హా||

## 42

(కంద - కందు - నీయన్నకై - విజయకృష్ణ) వలె.

ప॥ జయము — మంగళంబిదే — జయము — జయము — శ్రీరామా

అ॥ జనకాత్మజాప్రియమా — జయము — రఘురామా ||జ||

1. తాటకిని మర్దించి — తపసియాగము గాచి
రాతి నాతిగ జేసి — ఖ్యాతినందిన — రామా ||జ||

2. హరునివిల్లు విఱచి — అతివను పెండ్లాడి
పరశురాముని — గర్వ — భంగమొందించినా రామా ||జ||

3. పితృవాక్యపాలన — పుత్రధర్మమంచు
పత్నితో — కానలకు — పైనమైనారామా ||జ||
4. దశకంఠు బరిమార్చి — ధరణిజ అనుజులగూడి
తక్షణము — అయోధ్య — తరలివచ్చినరామా ||జ||
5. భద్రాద్రిపురవాస — భామసీతకు నీకు
విజయహారతీదె — వీరలక్ష్మీనుత రామా ||జ||

# 43

(ఏమిరా - పట్టాభిరామా - ఎందుకలిగినావురా) వలె.

పll పాహికృష్ణ — పాహికృష్ణ — పాహికృష్ణ — పాహిమాం
అll పాహిపాహి — అనంతరూపా — పచ్చకర్పూరహారతీ ||పా||
1. సకలహృదయవిహార కృష్ణ — సత్యపాలన — మాధవా
రాధికామనోహరా — రాక్షససంహారకా ||పా||
2. కరుణతో గజరాజునేలిన — భక్తవత్సల — శ్రీధరా
భావమందు నీదునామ - భక్తియొసగి బ్రోవుమా ||పా||
3. ద్వారకీపురవాస కృష్ణ — దోషరహిత నీ - రామసమా
దోసిలొగ్గి వేడుచుంటిని - గిరిధరకృష్ణ - బ్రోవుమా ||పా||
4 విశ్వపాలన - వితరణగుణ - విజయము లొసంగుమా
వీరలక్ష్మీసన్నుత - విజయహారతి గొనుమిదే ||పా||

# 44

(భక్తజనపాలా—కరుణాకర—పావనానామ) వలె.

పll శ్రీవేణుగోపాలా - గైకొనుమా - మంగళహారతీ -
మాంపాహి
అll మనవిగైకొనుమా - మహిమాత్మ - సత్యపాలన-సత్యేశా ||శ్రీ||

1. తల్లిదండ్రిగురువు - దైవామనుచునమ్మితిని - నిన్నింతో
తాండవలోలా — దయాకర — దయతోబ్రోవుమా -
దయానిధే ||శ్రీ||
2. అతివ ద్రౌపది హాకృష్ణా యనుచు వేడగను, అక్షయముగ
వలువలొసగినావనాన - వందనంబిదుగో వనమాలీ ||శ్రీ||
3. వాసిగా పిసపళ్ళపురమున వరలుచుంటివి పరమాత్మ
వరాతిరుక్మిణీసత్యలతో—హారతిదె - గొనుమా—కరుణానిధే ||శ్రీ||
4. ప్రేమతో గజరాజు నేలిన - భక్తవత్సలుడా
విజయాధర విజయహారతీ వీరలక్ష్మీహృదయ పరిపాలా
పాహి శ్రీహరీ ||శ్రీ||

## 45

(పాడవేరాట్న మాగ్రణవభారతగీతి) వలె.

వ|| హారతీ — గైకొనుమా — గోపాలకృష్ణయ్యా
అ|| ఆనంద — ముకుంద అచ్యుత మాంపాహి ||హా||
1. గోపరిపాలక — గోవర్ధనోద్ధారి — కొనియాడతరమా నిన్
కోటిమన్మధరూప-కూరిమితో కృపజూపు-కృష్ణపరమాత్మక ||హా||
2. మోహినీ వేషధర - మోక్షప్రదాయకా
రాధాహృదయువాస - రాక్షసాసంహార
సుందరసుకుమార - సుగుణభూషణ కృష్ణా ||హా||
3. వాసిగా పిసపళ్ళపురమున — వెలసిన శ్రీవేణుగోపాలా
శ్రీలక్ష్మీసత్యలతో — వీరలక్ష్మీయిచ్చే — విజయమంగళ
జయా ||హా||

## 46

(భారతభూమి - మన ... )
వ|| వేగ ... రారా — వేణుగోపాలా ... నుమా

జయహారతి — యిదెగొనుమా - శుభహారతి — యిదెగొనుమా

అ॥ అవనిజలోలా — ఆశ్రితలోలా
సుందరవదనా — నందకుమారా ॥వే॥

1. నీలవర్ణ యీజాలమదేలా - నిరుపమాన - కరుణాకర శ్రీహరీ
పరమపురుష — నీపదపద్మములకు — పరిమళహారతి దే —
భయవిహార ॥వే॥

2. చిన్న బాలుడు — శ్రీహరిహరియన
ప్రేమతోను — ప్రహ్లాదునిబ్రోవవే — నగధరకృష్ణ
నా మొఱవినవా — నవరత్నపుహారతి దే — నామదినిన్నే నమిత్ర
గా ॥వే॥

3. వాసిగానుపినపళ్ళపురమునా — వెలసియున్న శ్రీ — వేణు
గోపాలా, శ్రీలక్ష్మిసత్యభామలతో — స్వీకరింపుమా —
సుందరహారతి దే ॥వే॥

4. పదునాల్గుభువనంబులు — కుక్షిలో
పొందుగ నిలిపిన - పుండరీకాక్ష
విజయాంబరధర - వినుతగుణాకర
వీరలక్ష్మివినత - విజయహారతి దే ॥వే॥

## 47

(భక్తజనపాలా - పరమాత్మ - పలుకవదియేలా) వలె.

ప॥ మురళీకృష్ణయ్యా — ముత్యాలహారతి దే - గొనుమా రుక్మిణితో

అ॥ సత్యభామాప్రాణలోలా - సత్యపరిపాలా - సర్వేశా ॥ము॥

1. గోవర్ధనపర్వతంబు గొడుగుగా చేతను ధరించి
గోపగోపులనూ - కాపాడిన ఘనుడవు - నీవే కరుణాకర ॥ము॥

2. పసితనమున - పాలీయవచ్చిన పూతనాను

రూపుమాషిన — పుండరీకాక్ష — శ్రీహరీ —ద్వారకీవాసా —
దయాళో ||ము||

3. మన్నుదిన్నావనుచు మాత - మరిమరీ దండనసేయ
అన్నిలోకాముల్ నోటను — అట్టేజూపితివి
పరమాత్మ — పన్నగాశాయి — దయానిధే ||ము||

4. మోహినిరూపంబుదాల్చి - మోదమున నమృతము చేకొని
అసురులాకు — అట్టేజూపుచు — సురులకొసగీనా —
శుభగుణాకర ||ము||

5. విశ్వమంతయు — కుక్షినింపిన — విజయపరిపాలా
గోపాలా-వీరలక్ష్మినిబ్రోవుమా—కోమలహృదయాశ్రీహరి ||ము||

# 48

(ఎంతరాణిచే - నోవాదినసీవు) వలె.

ప|| హారతీయిదె — మురళీగోపాలకృష్ణ
అ| హారతీగైకొనుమా — అతివరుక్మిణితో
ఆనందశుభచరితా — అనుదినమునమా ||హా||

1. యమునానదివిహార — యశోదాకుమార
సుందరా — సుకుమార — మందరగిరిధర ||హా||

2. పుండరీకవరదా — పండరీశ్రీరంగా
పారిజాతహార — పరమపావనమూర్తి ||హా||

3. వాసిగపినపళ్ళపురమున — వెలసిన
శ్రీవేణుగోపాలా — శ్రీలక్ష్మిసత్యలతో ||హా||

4. విశ్వవ్యాపకా — విమలస్వరూపక
వీరలక్ష్మినుత — శ్రీవాసుదేవా ||హా||

## 49

(ఎవ్వారోరి – బాలులార – యెరిగింపుమా రాజుతో నా) వలె.

ప॥ వేణుగోపాలక్రిష్ణ — వేదా వేదాంత వేద్యా

అ॥ రాధారుక్మిణీలోలా — రత్నాలహారతియిదే ॥వే॥

1. భక్తులైన పాండవులను — కరుణాతో కాపాడిన హరీ
కల్యాణగోపాలా నీ — కంజములే — మదినమ్మితి ॥వే॥

2. దీనజనులను బ్రోచే — బిరుదూ దాల్చినహరీ
రమణీమోహనాకార — రక్షింపుమా — రాజీవాక్ష ॥వే॥

3. వాసిగానుపిన — పళ్ళపురమున వెలసియున్నా
శ్రీవేణుగోపాలా — శ్రీలక్ష్మీసత్యభామలతో ॥వే॥

4. వైకుంఠనాయక హరీ - వందానమిదె గైకొనుమా
వామాంకలక్ష్మీధరా — వీరలక్ష్మీసన్నుతా ॥వే॥

## 50

(పణతిరో — నీపతినిగూడియు — పూలబంతులనాడుమా) వలె.

ప॥ హారతిచ్చెద — బాలక్రిష్ణ - అతివ రుక్మిణితోగానూ

అ॥ హారతీ - జయహారతీ - శుభ - అచ్యుతా - కరుణాకరా ॥హా॥

1. ఎన్నోవిధముల — వేసుచుంటిని — యాదవాకులభూషణా
పతితపావనా — బాలక్రిష్ణ — స్వామి మమ్ము బ్రోవుమా ॥హా॥

2. మంగళాలయు — మారజనకా — మాధవా — మురాహరీ
నీలవర్ణ — నీదుపాదభక్తి — దయతో నొసగుమా ॥హా॥

3. పార్థసారథి - పన్నగాధిప — పద్మనాభ — పరాత్పరా
విశ్వపాలన — వితరణాగుణ — వీరలక్ష్మీసన్నుతా ॥హా॥

# 51

(గజ్జెలందెలు మ్రోయఁగ కృష్ణా - కదంసారి వెన్న ముంగిపోరా) వలె.

ప॥ మంగళహారతి జే - కృష్ణా - ఓ - సుందరనందకుమార
అ॥ మాధవ శ్రీధర - రాధామనోహర - రత్నాల హారతి జే కృష్ణ ॥మం॥

1. గోవర్ధనగిరిధర కృష్ణా - కోటిసూర్యసమతేజా.
గోపికలోలా - కోమలహృదయా - మోహనరూపా - మురళి
ధరా కృష్ణ ॥మం॥

2. పాదములకు - ముకుందశౌరి - కృష్ణ - ముత్యాలహారతి దే
గొనుమా
విశ్వంభరాధర - విజయసంరక్షక - వీరలక్ష్మీసన్నుత కృష్ణ ॥మం॥

# 52

(వదినెలార - మీరు - ఎపుడు - వచ్చినారండీ) వలె.

ప॥ బాల - గోపాలకృష్ణా - పన్నగశాయీ
అ॥ పచ్చకర్పూరహారతి గొను - పరమకరుణామయా ॥బా॥

1. మురళికృష్ణ - మోహనాంగ - మునిలోకపూజితా
ధరణీశ్వర - దయాకర నామ - వేగ బ్రోవుమా ॥బా॥

2. గోపికావస్త్రాపహార - కోమలహృదయా
పరమపురుష - భక్తవత్సల - పార్థసారథీ ॥బా॥

3. వెన్నదొంగవనియందురు - వేదాంతవేద్య - నిన్
నీలీలలు కడుచోద్యమయ్యా - నీరజేక్షణా ॥బా॥

4. వాసిగాంచినపల్లిపురమునను - వెలసియుంటివి
బాలారుక్మిణి - సత్యభామాలతో గూడి ॥బా॥

5. దీనజనుల నాదరింప - బిరుదు దాల్చితివి
వీరలక్ష్మీసన్నుత శ్రీ - వేణుగోపాలా ॥బా॥

## 53

(బంతులాడిరి—శ్రీ-రాధాకృష్ణులు) వలె.

ప॥ రాధాగోపాలక్రిష్ణ - హారతీయిదె - జయ

అ॥ రారా మురళీవినోద - రమణీమోహనాకార

పరమమంగళామూర్తి - పార్థసారథీ - జయ

1. ఈశా - పరమేశా - జగదీశ్వర కృష్ణ

దేవదేవ - దీనబంధు - దివ్యహారతీ జయ ॥రా॥

2. ద్వారకనివాస కృష్ణ - దోషముల నెంచకుమా

దోసిలొగ్గి వేడుచుంటి - కరుణజూడుమా జయ ॥రా॥

3. విశ్వము ధరియించిన - వీరాధివీరుడా

వీరలక్ష్మీనన్నుత - శ్రీ - విజయలక్ష్మితో జయ ॥రా॥

## 54

(చిన్నవాడ — నన్నేలు — కోర — కన్నెప్రాయము నుంటినిరా) వలె.

ప॥ బాలక్రిష్ణా - పరమపురుషా - పరిమళాహారతి - గొనుమా

అ॥ భానుతేజ - పద్మబాంధవ - పాలనాసేయుము కృష్ణా ॥బా॥

1. గోపికాహృదయాపహార - గోకులాసంచార శ్రీహరి

యాదవాకులదివ్యరత్నము - ఎన్నవశమా - నీదుమహిమలు॥ బా॥

2. శంఖచక్రపీతాంబరాధర - పక్షివాహనప్రియ - హరీ

వీరలక్ష్మీవినుత కృష్ణా - విజయహారతిదే నీకు ॥బా॥

## 55

(దేవాదిదేవా - కావరావా) వలె.

ప॥ హారతి-యిదిగో-శ్రీరాధాకృష్ణ-హారతిగొనుమాగుక్మిణీనాథా

అ॥ వరాహామూర్తి - వసుధోద్ధారక

వనమాలాధర - పరగుణశీలా ||హా||

1. కాళింగమర్దన - కమనీయగుణా
దీనబాంధవ - దేవదేవ
యదుకులభూషణ - రేల యీజాలము ||హా||

2. భుజంగశయనా - పూతనసంహార
గోవర్ధనధర - కోమలాకార
కొనుమిదె హారతి - కూరిమితోను ||హా||

3. విశ్వంభరాధర - వినుతగుణాకర
వీరలక్ష్మీసన్నుత - విజయగోపాలా
విజయలక్ష్మీతో - వేగ మెగొనుమా ||హా||

## 56

(శాలా - రుక్మిణి - నాతో - బంతులాడగదే) వలె.

ప|| హారతి - గైకొనుమా - అతివరుక్మిణీతో
అ|| ప్రొద్దోయె - జాగేలా - బాలగోపాలా ||హా||

1. పారుజాతహార - పతితోద్ధారా
వత్సలహారతి - పరమాత్మక్రిష్ణా ||హా||

2. జగన్మోహనరూపా - జగదాధార
జయజయగోపాలా - తాండవలోల ||హా||

3. విశ్వరూపధర - విమలస్వరూప
వీరలక్ష్మీనుత - విజయగోపాలా ||హా||

## 57

(అరగించుమా - శ్రీరామచంద్రా - అరగింపుమా) వలె.

ప|| మంగళంబిదే - పార్థసారథే
అ|| మందరాధరుడ - మగువ రుక్మిణితో

సుందరశుభాంగా - బృందావనలోలా శ్రీకృష్ణా ||మం||

1. సత్యసంధాయక - చక్రగదాధర
అమితవిక్రమశాలీ — జయ శ్రీకృష్ణ ||మం||

2. గజరాజు మొరవిని - కరుణతో - వేగ తెంచి
మకరినిద్రుంచిన - మధుసూదనా - కృష్ణ

3. వేదాలుచేకొని - విడిశౌ - దైత్యుని గొని
అష్టయిశ్వర్యములు - అష్టైఁ యొసగిన కృష్ణ ||మం||

4. ఫణిరాజు తల్పముపై - బాలలక్ష్మితో
పవ్వళించియున్న - పరమాత్మ శ్రీకృష్ణ ||మం||

5. ద్వారకానిలయా - దీనజనపాలా
వీరలక్ష్మీసుత - నిజభక్తలక్ష్మితో కృష్ణ ||మం||

# 58

(శాంతము లేక — సౌఖ్యము లేదు — సారసదళనయనా) వలె.

ప|| జయజయ - హారతీ - జనార్దన - గైకొనుమా

అ|| జానకీమనోహరా - జగదోద్ధారా ||జ||

1. దేవదేవా - హరీ - దివ్యస్వభావుడా
పరమమంగళాకారా - పద్మనేత్ర రాఘవ ||జ||

2. అహల్యపావనా - అవనిజాజీవనా
అంబుధిబంధన - అసురసంహారక ||జ||

3. నీలమేఘశరీరా - నిఖిలలోకపూజితా
నీరాంజనంబిదే - నీనవ్వు మోమునకు ||జ||

4. ధవళేశ్వరాపుర - పరమాంశ వెలసిన
జానాజనార్దన - దయతోను శ్రీలక్ష్మితో ||జ||

5. విశ్వంభరాధరా - విజయసంరక్షక
వీరలక్ష్మి యిచ్చే - విజయమంగళ - జయ ||జ||

## 59

(కొనియాడతరమా - నిన్నుకువలయవినుత) వలె.

ప॥ స్వీకరింపుము - హారతీ - శ్రీరుక్మిణితో

అ॥ శ్రితజనపరిపాలా - శ్రీగోపాలకృష్ణా ॥స్వీ॥

1. నిగమగోచర శౌరీ - నిత్యానంద మురారీ
నిత్యమంగళరూపా - నీనవ్వేమోహనకు ॥స్వీ॥

2. కపటనాటకధారీ - గరుడగమన హరీ
గజరాజవరదుడ - కలుషసంహారుడ ॥స్వీ॥

3. వాసిగ పినపళ్ళ - పురమున వెలసినా
శ్రీవేణుగోపాలా - శ్రీరుక్మిణీసత్యలతో ॥స్వీ॥

4. విశ్వంభరాధర - వినుతగుణాకర
వీరలక్ష్మిహృదయవాసా - చిద్విలాసా ॥స్వీ॥

## 60

(జాలమేల — గోపాలక్రిష్ణ — నీలీలలు — గనుగొనతరమా) వలె.

ప॥ మంగళకర - శ్రీరాజగోపాలా
మంగళహారతి - ఇదెగొనుమా జయ

అ॥ మారునిజనకా- మాధవక్రిష్ణ-మగువరుక్మిణితో-చేకొనుమా॥మం॥

1. కనకాంబరధర - కమలదళేక్షణ
కరుణజూపుమా - కరుణానిధే
గోవర్ధనగిరిధర - గోపాలా - గోకులబాలా - గోవిందా ॥మం॥

2. రాధామనోనివాస - శ్రీకృష్ణ - రమ్యగుణాకర
రక్షింపుమా - భక్తదయాపర - పన్నగశాయి - వచ్చ
కర్పూర హారతిదే ॥మం॥

3. వాసిగాను పిఠాపురంబున - వెలిసియున్న వేణుగోపాలా
వెలదిరుక్మిణి-సత్యభామలతో-వీరలక్ష్మి స్సుత-గైకొనుమా||మం||

# 61

(ఇంతులాడరావే - భామిణిరో - ఇందిరుక్మిణినా - చెంతకేరి) వలె.

ప|| మంగళాహారతీ - మాధవా - గొనుమిదే
అ|| మందారోద్ధారుడ - మధుసూదన - హాగే ||మం||
1. పక్షీంద్రవాహన - పరమాత్మ - మూరారే
పాలనసేయుము - పరమపురుష - వరదా ||మం||
2. వైకుంఠనాయక - లోకసంరక్షక
లోపాములెంచాకమా - ఆపదోద్ధారక ||మం||
3. విశ్వంభరాధర - వీరలక్ష్మి స్సుత
కాంతశ్రీలక్ష్మితో - కమలాక్ష కర్పూర ||మం||

# 62

(భారతభూమియే మనదే కానీ - ఫలితము - మనకేదీ) వలె.

ప|| హారతిగొనుమా - అచ్యుతకృష్ణ - ఆనందమురారే - వ, వ, వ
అ|| అనాథనాథా - ఆర్తశరణ్యా
ఆనందంబున - అనుదినంబును - జయ్, జయ్, జయ్ ||హా||
1. తాండవలోలా - తారకనామా
పతితోద్ధారా - పదకమలములకు - జయ్, జయ్, జయ్ ||హా||
2. కరిరాజు-ఆ-మకరికిచిక్కి-కావుమనుచు శ్రీహరియని వేడ
కరుణతో బ్రోచిన - గరుడవిహారా - కర్పూరహారతిదే
జయ్, జయ్, జయ్ ||హా||

3. పేదకుచేలుకు - పెన్నిధియొసగి
ప్రేమతోను - ప్రస్తోషుని - బ్రోవవా
విజయాంబరధర - వీరలక్ష్మికి
విజయము లొసగుమ - జయ్, జయ్, జయ్ ... ॥



## 63

(వాసుదేవా - జాలిలేదా - వనమాలీ - బ్రోవరావా) వలె.

ప॥ మంగళాహారతి గొనుమా - మాధవా - బృందావనలోలా
అ॥ మహిధరాయ- మంగళాలయ- మానసతామ్రజప్రియహారి॥మం॥

1. సర్వాంతర్యాలక్షణాయ - సత్యస్వరూపరాక్రమాయ
గోపికామానసహరా- గోకులాసంచార శ్రీహరి ॥మం॥
2. వేణువీణాగానలోలా - వేసురు నిను వేడుచుంటిని
కమలనయనా-కరుణాలోలా - కావుమా- కరివరద శ్రీహరి॥మం॥
3. సనాతనా- సర్వేశ్వరాయ- సత్యముగ మది నమ్మియుంటిని
పరమపురుషా - శుభకరాయ - పన్నగశాయి శ్రీహరి॥మం॥
4. విదురా అక్రూరవరదా - విశ్వరూపప్రదర్శనాయ
విజయపాలా - వీరలక్ష్మి - విన్నపంబాలింపుమా హరి ॥మం॥

## 64

(ఎంతో - బీదవాడమ్మా - గోపాలుడు) వలె.

ప॥ శ్రీకృష్ణా-పరమాత్మా-దేవకితనయా-దివ్యహారతిగొనుమా
అ॥ శ్రీకరుణాకర - శ్రీరుక్మిణితోగూడి
శ్రీశృంగార - శ్రీకృష్ణ - స్వీకరింపుము వేగా ॥శ్రీ॥

1. పాహి ముకుందా - పాహి మురారే

పాహి అనంత నీ — పాదపంకజమ్ములకు ||శ్రీ||
2. భవ్యస్వభావ నీ — బాలారుక్మిణితోటి
వచ్చకర్పూరంపు — నిత్యజయహారతీ ||శ్రీ||
3. కనకాంబరధరా — కౌస్తుభమణిధర
కరుణాలోలా హరీ —వీరలక్ష్మీనుత ||శ్రీ||

# 65

(శరణం భవ— కరుణామయ — కురుదీనదయాళో) వలె.

ప|| కర్పూరహారతీ — కరుణాతో — గొనుమా
అ|| కాళింగమర్దనా — కల్యాణగోపాలా ||క||
1. దీనాతిదీనానై — వేడుచునుంటీ
వేడ్కతో బ్రోవుమా — వేణువినోదా
దీనరక్షకుడవు — దేవాదిదేవా ||క||
2. వసుదేవావరపుత్ర — వైకుంఠవాసా
వనమాలికాభరణ — వటపత్రశాయీ
వసుధామూపునదాల్చిన — వరహావతారా ||క||
3. పినపళ్ళపురమునా — వెలసియుంటివీ
బాలారుక్మిణి సత్య — భామాలతోనూ
వీరలక్ష్మీసన్నుత — వేణుగోపాలా ||క||

# 66

(ఇది న్యాయమా — శ్రీరామచంద్రా) వలె.

ప|| హారతిచ్చెదా - శ్రీ - బాలాగోపాల నీకు
అ|| హారతిగైకొనుమా - అమరేంద్రవినుత
అసురసంహారక — అనుదినము జయా ||హా||

1. సాధుహృదయవాస — సత్యస్వప్రకాశ
అంతరంబునను — చక్రధారి — నీమోహమునకు ||హా||
2. వైకుంఠపురవాసా — వటపత్రశయనుడ
పరమపావనమూర్తి — పాదపద్మములకు ||హా||
3. విశ్వసంరక్షక — వీరలక్ష్మీనుత
దరిజేర్చిరక్షింపు — దీనబంధుహారీ ||హా||

# 67

(ఏమానినేచెప్పుదూ — యీపెండ్లికొమరుని చరిత) వలె.

ప॥ మంగళహారతిదే—మన రాధికాలోలునకు—రాక్షసహరునకు
అ॥ పదహారువేల — గోపికాలనెల్ల
పాలించి బ్రోచిన — బాలగోపాలునకు ||మం||
1. ఫణిరాజశయ్యపై — బంగారుకిరీటకోటి
పవ్వళించియున్న — పరమాత్మకృష్ణునకు ||మం||
2. కాళింగమడుగులో — ఘనమైనపాముపై
మర్దనజేసినా - మురళీశ్రీకృష్ణునకు ||మం||
3. పాంచాలి సభలోను - భంగమొందిననాడు
అక్షయంబుగ వలు - వలిచ్చియున్న వారికి ||మం||
4. విశ్వరూపధారి — సృష్టిసంరక్షక
విజయలక్ష్మితోను — వీరలక్ష్మిసన్నుతునకు ||మం||

# 68

(శ్రీగోపాలా — పాహి — ముకుంద పాహి) వలె.

ప॥ జయగోపాలా — జయహారతిదేగొనుమా
అ॥ జయహారతిదే — గొనుమా — జయహారతిదే - కృష్ణా ||జ||

1. రుక్మిణీమనోహర — రాధికాలోలా — ధీరా
రాక్షసహరా — రత్నాలహారతి దే — కృష్ణా ||జ||
2. నిరుపమానసౌందర్యమూర్తి — నీనవ్వు మోమునకు
నిత్యజయా — నీరాంజనంబిదే — కృష్ణా ||జ||
3. కారుణ్యాలోల హరీ — కర్పూరహారతి దే
కరుణించుము — వీరలక్ష్మీసన్నుత శ్రీకృష్ణ ||జ||

## 69

(అనసూయాదేవికి — మంగళం — జయమంగళం — మంగళం) వలె.

ప|| మంగళం—జయమంగళం—శుభమంగళం—శ్రీగోపాలకృష్ణునకు
అ|| మంగళహారతి — మాధవరుక్మిణికి
వనమాలాధరునకు — వైకుంఠ శ్రీపాలకి ||మం||
1. వెలదులయిండ్లలో — వెన్న పాలు పెరుగు
దొంగిలించియున్న — దోషరహితు హరికి ||మం||
2. యమునానదిలోను — గొల్లభామలతోను
నౌకావిహారించిన — నందనందన హరికి ||మం||
3. బాల్యస్నేహితుడైన — పేదకుచేలునకు
అష్టైశ్వర్యముల — యిట్టె యొసగిన హరికి ||మం||
4. వాసిగ పినవళ్ళ — పురమున వెలసిన
వేణుగోపాలునకు - వీరలక్ష్మీసన్నుతు హరికి ||మం||

## 70

(సావిత్రి — వరమును దయయుంచెను పావనగుణ యాబాలికా) వలె.

ప|| నందకుమార నీ — నవ్వుమోమునకు
హారతియిచ్చెద — గైకొనుమా జయ

అ॥ మధుసూదన సీ — మానవరుక్మిణితో — మంగళహారతి —
చేకొనుమా ॥మం॥

1. నీలవర్ణ నీవు — జాగుసేయుకుమ — నిరుపమాన కారుణ్యనిధే
నిత్యము నీపదపద్మంబులకు—నీరాంజనమిదె గైకొనుమా జయ ॥మం॥

2. గోకులవాసా — గోపరిపాలా
తాపసవేష దయతోను — మునిగణసేవిత
ముద్దుకృష్ణనీవు — ముత్యాలహారతియిదె గొనుమా జయ ॥మం॥

3. పన్నగేంద్ర — శ్రీ — పతితపావన — భక్తజనావన
పరమాత్మ — పార్థసారథీ — పరమకృపాకర
పచ్చలహారతి — యిదె గొనుమా జయ ॥మం॥

4. సదయహృదయ నీ — సన్నిధి జేరితి
సరగున సత్కృపజూపుమయా
వీరలక్ష్మీనుత — విజయలక్ష్మితో — విజయహారతీ—యిదె
గొనుమా జయ ॥మం॥

# 71

(చిన్నికృష్ణ — చిన్నికృష్ణ — వన్నెలకృష్ణా) వలె.

ప॥ మంగళమని — మంగళమని — మంగళమనరే
అ॥ మంగళమని — పాడరే — మాగోపాలకృష్ణునకు—గోపాల
బాలునకు ॥మం॥

1. గోవర్ధనగిరి నెత్తి - గోపగోపులను - కరుణతో
కాపాడిన మా - ఘనుడు కృష్ణునకు - కంసనంహారునకు ॥మం॥

2. మన్నుతింటివని - యశోద దండనసేయగా
వదనాబ్జంబు - వనమునను జూపిన
పరమాత్మకృష్ణునకు - పార్థసారథికి ॥మం॥

3\. కాళింగమడువులో - ఘనమైనపాముపై
మర్దనాజేసిన - గోపాలునకు - ముకుందశౌరికి ||మం||

4\. దేవకీవసుదేవ - తనయుడు దేవాదిదేవునకు
వీరలక్ష్మి సన్నుతి చేయు - వైకుంఠనాథునకు - శ్రీమాలక్ష్మీపతికి ||మం||

# 72

(తొలినే - జేసిన పూజాఫలమూ) వలె.

ప॥ కర్పూరహారతి — కరుణతో — గొనుమా —
కల్యాణగోపాల — శాంతరుక్మిణితో

అ॥ మందరగధర — సుందరసుకుమార
రాధారమణా — కరుణాభరణా ||క||

1\. దేవకినందన — దీనజనావన
ద్వారకవాసా — దీనజనావన
మంగళమొసగుమ — మానసచోరా
మాలతిమల్లెలతో — మగిమరిపూజిస్తి ||క||

2\. వాసుదేవా — వరపుత్రరత్నమా
వామనమూర్తి — వసుధోద్ధారక
విశ్వంభరధర — విజయగోపాలనగుమా
వీరలక్ష్మిసన్నుత — నిజమాలక్ష్మితో ||క||

# 73

(వరదానవకుల — వార్ధిచంద్ర — జోలలందరా) వలె.

ప॥ బాల-గోపాలక్రిష్ణ-హా-గొనుమా-జయా-హారతిగొనుమా

అ॥ పరమపురుష - పావనచరితా ఆ, ఆ, ఆ, ఆ, ఆ
బాలగోపాలక్రిష్ణయ్య - హారతిగొనుమా - జయా ||బా||

1. యమునావిహార - యశోదానందకుమారా
నారదగానప్రియా - హరీ నామసనవిగోనమా ||బా||
2. ఆగమాంతసంచారుడ - ఆనంద మోహన
వీరలక్ష్మీసన్నుత - (శ్రీ) - విజయహారతీ ||బా||

# 74

(నన్ బ్రోవర - శ్రీమన్నారాయణ - వేగా) వలె.

ప|| మంగళమిదె - గొనుమా - మధుసూదన హరే
అ|| సుందరసుకుమార - సుజనజనావనా ||మం||
1. దీనజనోద్ధార - మందగిరిధర
బృందావనలోల -భుజంగశయన - హరీ ||మం||
2. పరమపావన నీదు - పదములే మదినమ్మి
పూజించియుంటిర - పుండరీకాక్షుడ ||మం||
3. విశ్వాంబరధర - వినుతగుణాకర
వీరలక్ష్మియునన్ను - విజయ విజయలక్ష్మితో వేగ ||మం||

# 75

(బ్రోవ భారమా - రఘురామా) వలె.

ప|| జాలమేలరా - రాధాగోపాలక్రిష్ణ
అ|| జగమేలే గోపాలా - జయహారతిగొన
1. నీలమేఘవర్ణ — నిరుపమసౌందర్య
నీనామరూపములకు — నీరాంజనమిదెగొను ||జా||
2. వనహారు వేలా — గోపికాలనెల్లా
పాలించి యేలినా — పరమమంగళమూర్తి ||జా||

3. విశ్వసంరక్షక — వినుతగుణాకర
వీరలక్ష్మీపోష — విజయహారతిగొన ||జా||

## 76

(శ్రీరామపాదమా - నీకృపజాలునే) వలె.

ప॥ జయజయ—హారతీ — సారంగపాణికి — సతతంబును జయ్ జయ్
అ॥ వనమాలాధరా — వైకుంఠవాసా
వామాంకలక్ష్మీతో — వాసుదేవదయానిధికి ॥జ॥
1. కర్పూరహారతి — కరివరదా హరీ
కరుణతో — బ్రోవుము — గరుడవిహారా
పరమపురుష — నీ — పదకమలములకు ||జ||
2. గోపికాలోలా — మునిజనపాలా
మొరవిన వేగా — మురళీలోలా
వీరలక్ష్మీసన్నుత — శ్రీ — విజయగోపాలునకు ||జ||

## 77

(మాసీతారామా — మనపాలించుమా) వలె.

ప॥ మంగళహారతిదే — శ్రీకృష్ణా — జయ
అ॥ మానసంరక్షక — మానినీమణికూడి
మానసమున — ఆనందముతో జయ ||మం||
1. అండజవాహన — అసురసంహారక
సురులను రక్షించిన — సుందరసుకుమార ||మం||
2. జలవిధరూపక — శశిధరపూజిత
శంఖచక్రధర — శాంతమూర్తి నీకు ||మం||



3. విశ్వసంరక్షక — వినుతగుణాకర
విన్నపమాలించి — వీరలక్ష్మి యిచ్చే ||నం||

# 78

(రామా - వందనం - రఘువంశజా — సేతుబంధనా) వలె.

ప|| జయహారతీ — దశరథా గొనుమా
ఉరగశయనా — ఉడిపిక్రిష్ణమ్మ
అ|| గజ్జెలందెలు — గల్లుగల్లునా
వేగామేరారా — వేడుచుంటినే ||జ||

1. పద్మబాంధవా — పలుకావేటిరా
భక్తపాలనా — పార్థసారథీ ||జ||

2. మోహినీవేషా — మురళీలోలుడ
నవరత్నభూషితా — నారదసన్నుతా ||జ||

3. దీనాబాంధవా — కరుణాజూపవా
క్షీరాసాగరా — శయనా — శ్రీహరీ ||జ||

4. శ్రీవాసుదేవా — శ్రీకరుణాకరా
వీరలక్ష్మివినుత — శ్రీహరీ ||జ||

# 79

(సాహిత్యం — వరగుణశీలాయని — పిలిచినపలుకవేమిరా) వలె.

ప|| నందగోకులబాలకృష్ణా — జయహారతియిదే — గైకొనుమా
అ|| నారదగానలోలా — నవనీత దధిచోరా
రాధామనోహరక్రిష్ణా — రత్నాలహారతిదే ||నం||

1. గోవర్ధనగిరిధారీ — గోవింద — గోపరిపాలా

గోపాల — బాలకృష్ణా — కల్యాణగోపాలా ॥సం॥

2 మురళీమోహనకార — ముకుంద — మాధవ — శౌరీ
కంస సంహార కృష్ణా — కాళింగమర్దన హరీ ॥సం॥

3. దేవకీనందన — సుకుమార — ద్వారకవాసా — జనార్దనా
దేవాదిదేవా — కృష్ణా — వీరలక్ష్మీసన్నుత — హరీ ॥సం॥

# 80

(సర్వమంగళనామా — సీతారామా — రామా) వలె.

ప॥ హారతిగైకొనుమా — దేవా — దేవా — దేవా

అ॥ దేవదేవా — దీనాబంధూ — క్రిష్ణా — క్రిష్ణా

1. సారసాక్ష — సన్నుతాంగ — సారంగపాణీ
సకలహృదయవి — హార హరీ — కృష్ణా — కృష్ణా ॥హా॥

2. గోకులాబృందావనలోలా — గోపాలక్రిష్ణా
నందకుమార — నవనీత చోరా — క్రిష్ణా — క్రిష్ణా ॥హా॥

3. విశ్వమోహన — విజయపాలక
విజయలక్ష్మితో - వీరలక్ష్మీసన్నుత - శ్రీకృష్ణా - కృష్ణా॥హా॥

# 81

(భక్తజనపాలా — సుశీలా — పరమపావనా) వలె.

ప॥ హారతి దేగొనుమా - దయాపర - బాలక్రిష్ణయ్య - కర్పూర

అ॥ ఆదిమధ్యాంతములులేక - అంతటానిండి
యుండిన — ఆనందస్వరూపా - శ్రీహరీ ॥హా॥

1. పక్షిరాజు కాతుణాని - మోక్షమిచ్చిన శ్రీహరీ
పన్నగశాయి - పరమాత్మ - పలుకవది సేంలా - దయతోనూ॥హా॥

2. శంఖచక్రపీతాంబరాధరా - శాపకేయూ - శబరి నేలిన
నీలవర్ణుడ - జాగేలా - నిత్యమంగళా — నీరాంజన ||హా||

3. కిరణాలోలా — భక్తపాలా
అసలతనయునకు — అభయమొసగిన
మోహినీవేషా—మొలమునఖా— మురళీకృష్ణ—ముత్యాల ||హా||

4. పాలకిపల్లెంమునక్రిష్ణా — వీరలక్ష్మీనన్నుతా హారీ
విజయలక్ష్మీతో—విజయాధరా—విజయహారతీ—కరుణానిధే ||హా||

## 82

(వియ్యపురాలా - వో - వయ్యారిలోలా) వలె.

ప|| పాహి ముకుంద — పాహి మురారీ — పాహి గోపాలక్రిష్ణా
అ|| పాహి పరమాత్మ శ్రీ—నాగపద్మమాలక—పచ్చలహారతిదే ||పా||

1. నటనసూత్రధారీ - నందగోకులవాసా
నారదమునివందిత — సుందరసుకుమారా
బృందావనలోలా — గరుడగమనా హారీ ||పా||

2. దివ్యాంబరధరా - దీనబంధూహారీ
ద్వారకపురిపాలక - దోషములెంచకుమా
దాసాజనార్దన - దయతోబ్రోవుమయా ||పా||

3. వేదమయా పరమా - నందసాగరా
వేణుగానలోలుడ — విశ్వాంభరాధరా
విజయగోపాలక — వీరలక్ష్మీనన్నుతా ||పా||

## 83

(తిలకము దిద్దరే — తిరుగ — శౌరికి) వలె.

ప|| హారతి యివ్వరే — గోపాలకృష్ణునకు
అ|| అతివ శ్రీలక్ష్మికి — అనుదినంబును జయా ||హా||

1. కరిరాజు మకరికి జిక్కి — కావుమా హరియన
గ్రక్కున బ్రోచిన — కలుషసంహారునకు ||హా||
2. పసితనమందున — పాలీయ వచ్చిన
పూతకిని జంపినా — పుండరీకాక్షునకు ||హా||
3. చిన్నప్రాయంబున — శ్రీహరి హరీయన
ప్రేమతో ప్రహ్లాదుని — బ్రోచినా — ప్రభువునకు ||హా||
4. పాంచాలి సభలోను — పాహి కృష్ణ యనగ
అక్షయవలువలు — అక్కై యొసగినహరికి ||హా||
5. విశ్వమానంతను — కుక్షిని నింపిన
వీరాధివీరునకు — వీరలక్ష్మీసన్నుతునకు ||హా||

## 84

(బ్రోవసమయా - మిదే - రామయ) వలె

ప|| జయహారతీ — దయతో గైకొనుమా — జగన్మోహినీ కేశవా
అ|| సనకసనందనులు — సన్నుతింపుచుండ
సఖియౌ శ్రీలక్ష్మితో — సరసిజదళనేత్ర ||జ||
1. దైత్యుల వధియింప — దశరూపములు దాల్చి
ధరణిజనుల బాధన్ — దయతోను బాపితివి ||జ||
2. అమృతకలశంబు — నసురుల కేజూపుచూ
దేవతల కొసగిన — దేవదేవుడవే ||జ||
3. పాలకడలిశయనా — పరమపురుష — వరద
ప్రత్యగభిన్నాత్మ — పాలించి బ్రోవవే ||జ||
4. నీదుపాదములలో — నివసించియుండెగంగ
ధ్యాయీనివాసుడవై — రాజిల్లుచుంటివే ||జ||
5. గరుడగమన హరీ — కలుషసంహారక
కర్పూరహారతీ — వీరలక్ష్మి యిచ్చె ||జ||

## 85

(పవళింప వేగారమ్మ — పద్మనేత్రి సీతతో) వలె.

ప॥ హారతి దే — గైకొనుమా — మురళీగోపాలకృష్ణ

అ॥ ఆదిమధ్యాంతరహితా — అవనిజనాధారా ॥హా॥

1. రాధామనోహరా — రమ్యగుణాకరా
రక్షింపుమయ్య — క్రిష్ణ — రాజరాజా గోపాలా ॥హా॥

2. పదహారువేలా — గోపికలానెల్లా
పాలించి యేలినా — పరమాదయానిధే ॥హా॥

3. ఖగవాహనావిశాలా — శ్రీకరగుణాకరా
లోకసంరక్షకా — లోపములెంచకుమా ॥హా॥

4. దీనదయాపరా — దివ్యమంగళరూపా
ద్వారకపురిపాలనా — దైత్యసంహారకా ॥హా॥

5. కోటిసూర్యప్రకాశకా — కోపియూడకరమూ నిను
వీరలక్ష్మిసమేతా — విజయలక్ష్మిగోనూ ॥హా॥

## 86

(సరిసరి నీ — సరిదైవము — లేదని — మరిమరివేడుచుంటినిరా) వలె.

ప॥ కొనుమిక హారతిదే — గోకులవాసా

అ॥ బృందావనలోలా — గోపాలాబాలా — తులసీవనమాలీ ॥కొ॥

1. పరమపురుష నీ — పడతిరుక్మిణితో
పరమశహారతియిదే — పరమాత్మకృష్ణా — పాలనసేయగదే ॥కొ॥

2. సర్వోత్తమాయు — సర్వాధారా — సరగునాబ్రోవుమయ్యా
సద్గుణధామా — సారసదళనేత్ర — సచ్చరిత్రా ॥కొ॥

3. పన్నగశయన నీ — పదములే పూజింతు

కరుణింపుము దేవా— కారుణ్యాలోలా— కాచియుంటిని నిన్ను

4. దీనజనావన — దేవకీనందన
దీపహారతి దే — దివ్యాంబరధారీ
సుందరసుగుణాకారా — సుకుమారా — వీరలక్ష్మీసన్నుత శౌరా ॥మం॥

# 37

(ఎన్నుగాను — రామభజన — కన్న మిక్కిలి — అన్యుదా) వలె.

ప॥ మంగళమిదె — గైకొనుమా — మంగళరూపాకారకృష్ణా
అ॥ మంగళస్వరూపా — మాణిక్యమకుటధారీ
మాయామానుషవేష — మునిజనమోహన సురుజనకా ॥మం॥

1. నందనందన — పాపభంజన — నగధరా గోపాలకృష్ణ
నారదాది హృదయభావన — మధురాపురీనివాస ॥మం॥
2. బృందావనవిహార — రాధామనోహరా భక్తమానసచోరా
భవభయహరణా — పావనశ్రీశౌరీ ॥మం॥
3. నిగమాంత వేద వేద్య — నీరజేక్షణ నిఖిలపోషా
వీరలక్ష్మీహృదయభావన — విజయలక్ష్మీతో సుమాడి ॥మం॥

# 88

(భారతమాత — ఈశాన్యగతి — కనవమ్మా) వలె.

ప॥ మంగళమనరే— మా రాధాకృష్ణులకు— జయమంగళమనరే
అ॥ మంగళమునిపాడరే — మా రాధాగోపాలునకు ॥మం॥

1. కొలదులయిండ్లలోను — వెన్న పాలు ముచ్చిలించి
బాలురతో భక్షించిన — ఫణిపతిశాయునకు ॥మం॥
2. చాణూరముష్టికులను—శిరసులక్రుంగించి—సృష్టినరక్షించిన
సుందరసుగుణాకరునకు ॥మం॥

3. కంసునిబరిమార్చి [illegible] — కన్నతల్లిదండ్రులకు
కష్టములు తొలగించిన — కరుణార్ద్రహృదయునకు ||మం||
4. శ్రీహరి [illegible] — శ్రీరుక్మిణి పరితపింప
ప్రేమతో పెండ్లాడిన మా — ప్రేమస్వరూపునకు ||మం||
5. పదునాల్గు భువనంబుల — కుదురుగ కుక్షిని ధరించిన
దేవాదిదేవునకు మా — దివ్యప్రభావునకు ||మం||
6. నీలమేఘశ్యామునకు — సగుణసౌందర్యమూర్తి
నిత్యానందమురారికి — వీరలక్ష్మీసన్నుతునకు ||మం||

# 89

(ఎంతనేడుకొందు — రాఘవా) వలె.

ప|| మంగళంబిదే — మధుసూదనా — హరే
అ|| సన్నుతాంగశ్రీ — సఖి లక్ష్మితో — జయ ||మం||
1. కందర్పకోటి — సౌందర్య శ్రీహరీ
ఖగవాహనవిహార — కరుణాజాపురంగా ||మం||
2. నందనందనా — పాపభంజనా
శ్రితజనపరిపాలా — శ్రీపాండురంగా జయ ||మం||
3. సత్యాభామినీ — సరగున బ్రోవవె
సంతసముతో నీదు — సేవ యొనరుగు రంగా జయ ||మం||
4. భక్తవరుల నెందరినో — బ్రోచితివే—
పావనశుభ చరితా — పరమాత్మ — శ్రీరంగజయ ||మం||
5. మంగళాలయ — మాధవా మురారే
వీరలక్ష్మీహృదినివాస — శ్రీరంగ జయ ||మం||

## 90

(తల్లి నీ — కిగో — హారతీ — నీకమ్మతల్లీ) వలె.

ప|| హారతీ గైకొనుమా — హరీ — అరవిందలోచనా

అ|| అతివ శ్రీలక్ష్మితోను — అచ్యుతా అనంత పాహి ||హా||

1. గోవర్ధనపర్వతంబు — గొడుగుగ చేతను ధరించి
గోపగోపులగాల్ల — కరుణతో — కాపాడినావు హరీ ||హా||

2. యోగసంరక్షక — యాదవ కుల భూషణా
ధరణిధరా జాలమేల — దయతోను బ్రోవు హరీ ||హా||

3. దేవాదిదేవ నీదు — దాసురాలగు వీరలక్ష్మి
దాపుజేరి వేడుచుండె — దాశరథీ దయతో వేగా ||హా||

## 91

(పారిజాతాపుష్పాల - బంతుల బాలకృష్ణుడాడెనే) వలె.

ప|| మంగళంబిదె - గైకొనుమ - లక్ష్మీపతే - నారాయణా

అ|| లోపములు మది నెంచక కాత్యాయణా — కరుణాకరా ||మం||

1. నారదాదిమునీంద్రవందిత — నందనందన సుందర
సాధుహృదయనివాస — సజ్జనపోష — శ్రీకరుణామయా ||మం||

2. గానలోల ముకుంద — మాధవ — గరుడగమన పరాత్పరా
శ్రీధరా — అనంతరూపా — సేవగైకొని బ్రోవరా ||మం||

3. నిన్ను వర్ణించుటకు వశమా - నీరజేక్షణ - శుభకరా
నన్ను కావగ - సజ్జనావన - సాధులోకశరణ్యమా ||మం||

4. మోహనాంగ ముకుంద కేశవ-మోక్షదాతా-మురహరా
వీరలక్ష్మిహృదయనివాసా - సద్గుణా - సర్వేశ్వరా ||మం||

## 92

(రామా – రఘువంశసోమా– రారా – బ్రోవరా) వలె.

ప॥ కృష్ణా గోకులసంచారా – కూరిమిమీతో నూ

అ॥ హారతి దే – గైకొనుమా – అతివ రుక్మిణితో ॥కృ॥

1. మునిజనపూజితుడ – మురళీ మోహన

ఖగవాహనసంచారుడ – కరివరదా – కృష్ణా ॥కృ॥

2. గోపికామానసహార – కోమలహృదయ

గోకులాబృందావనలోలా – గోవర్ధనధారీ ॥కృ॥

3. యశోదనందకుమార – యమునావిహార

వీరలక్ష్మీసన్నుత – శ్రీ – నందనందనకృష్ణా ॥కృ॥

## 93

(బంటురీతి – రా – వేగా) వలె.

ప॥ మంగళము గైకొనుమా – నాసిసీమనోహర

అ॥ సురజనకాధీర – మగువ – శ్రీలక్ష్మితోనూ ॥మం॥

1. దేవాదిదేవ – రామా – దివ్యసుందరాకార

కారుణ్యగుణాధీరా – కమలాబాంధవ హారీ ॥మం॥

2. నందనందన రామా – నవరత్న భూషితాకార

సుందరమోహనరూప – సుకతితో విజయు ॥మం॥

3. వినుతగుణాకర – వీరలక్ష్మీసన్నుత

నీలమేఘశరీరా – నిరుపమసౌందర్యలోలా ॥మం॥

## 94

(రామా – ననుగావరా – ప్రేమలేదటరా) వలె.

ప॥ పాండురంగమూర్తి – పచ్చలహారతి జే

అ॥ పడతిరుక్మిణితో – పరమాత్మ గైకొనుమా ॥పాం॥

1. నళినదళేక్షణా హరీ - నారదాదిమునిసన్నుతా ఆ
ఆ నామదేవుప్రీతియా - నామనపిగ్గె [illegible] ఆ, ఆ, ఆ ॥పాం॥
2. భక్తులాపాలిటి - పరమదయానిధే - ఎ, ఎ
భవభయారహితా నీదు - పదసేవ యొసగుమా ఆ, ఆ, ఆ ॥పాం॥
3. పాలకడలిశయనా - పద్మమాలాధరా - ఆ, ఆ
విజయనగరరక్షక - వీరలక్ష్మిగనన్నుతా - ఆ, ఆ, ఆ ॥పాం॥

# 95

(ఎవ్వారేరి — బాలలార — ఎతిగింపుమా రాజాతోను) వలె.

ప॥ మంగళంబిదే - గొనుమా - పుండరీకవరద
అ॥ పండరిశ్రీరంగనాథ - భామ రుక్మిణితోను ॥మం॥
1. పురాణపురుషుడ - పురంధరసేవితా
పూజింతును పాదములు - బృందావనలోలాహరీ ॥మం॥
2. భక్తమణుల నెందరనో — పావనుల జేసితి వే
భారమంతని దేసుమా — పరమాత్మ — శ్రీపాండురంగ ॥మం॥
3. విశ్వము నంతయు — ఈక్షించి ధరియించిన
వీరాధివీరుడ — వీరలక్ష్మిసన్నుత ॥మం॥

# 96

(నేను — మనమందరముగూడి — పాడుదము — పరమేశుని) వలె.

ప॥ పండరీశ్రీరంగనాథ — పరిమళాహారతి జే
అ॥ భక్తవత్సల — పరమపురుష — పడతిరుక్మిణీతోగొను ॥పం॥
1. శేషశయన — చంద్రవదన — సేవగైకొని బ్రోవుమా
నీలవర్ణ జాలమేలను — నిఖిలలోకపూజితా ॥పం॥

2. తుంబురనారదులచే — శృంగార మోహనా
తుంకగోపదాస పోషక — తులసీదాస సన్నుతా ||పం||
3. సకలమూ నీవు వేడుచుంటిని — సర్వలోక శరణ్యా మా
సజ్జనప్రియా — శాంతరూపా — వీరలక్ష్మి సన్నుతా ||ప||

# 97

(చెలియ యీకనామునా — చెండ్లను ఆడుదమే) వలె.

ప|| మంగళహారతిదే — రంగ నీకిదే - జయా
అ|| బంగరుపళ్ళెములో — పచ్చకర్పూరంపు ||హా||
1. నీపదద్వయము — నేనెందు గానరా
నిన్నె నేనమ్మితినే — నీరజనాభా జయా ||హా||
2. దోషరహిత నా — దోషము లెంచకమా
దోసిలొగ్గి వేడుచుంటి — దాసజనవరదా — జయా ||హా||
3. పండరీపురావాస — పరమాత్మ శ్రీరంగా
పావనముగు నీ — పదపద్మములకు జయా ||హా||
4. జయ, జయ, శ్రీరంగా — జయుజయా పాండురంగా
వీరలక్ష్మిసన్నుత — విజయలక్ష్మితో జయా ||హా||

# 98

(మధురానగరిలో — చల్లనమ్మబోదు) వలె.

ప|| మంగళహారతీ — రంగ నీకిదే జయా
అ|| మంగళాలయా — ధరణీధరాత్మా ||మం||
1. నకుబాయికి — సాక్షాత్కరించి
సేవలొసగిన — శాంతమూర్తివి ||మం||

2. తుకారామునీ — తులసీదాసుని
దయతో బ్రోచిన — దశావతారునకు ||మం||

3. వాయువాహనా — వసుధోద్ధారక
వటపత్రశాయి — వాసుదేవాయ నీకు ||మం||

4. పురాతనపురుషా — పురందరవాసా
చక్రగదాధర — సత్యసంధాయకు ||హా||

5. విశ్వరూపకా — సృష్టిసంరక్షక
వీరలక్ష్మీనుత - విజయలక్ష్మీనుత ||హా||

# 99

(మీనాంబా నీముద్దులతనయుని - ప్రేమతోజూడుమా) వలె.

ప|| మంగళకర శ్రీ — పాండురంగ నీకు — మంగళహారతి దే
అ|| కరుణాసింధో — కాంతనుగైకొనుమా ||మం||

1. పక్షివాహనా— పరమపావనా — చక్రగదాధర—సర్వేశా
సకలహృదయపోష — నిత్యము నీపదపద్మంబులకును
నీరాజనమిదె ||మం||

2. నిమిషమైన నిను — మరువకుండగా — నీకృపజూపుమా
పరమాత్మ — పావనగుణధామా — పాలింపుము— పచ్చల
హారతి దే ||మం||

3. శ్రీకరుణాకర—భక్త వశంకర—దయతో బ్రోవుమయా—
దయానిధే ||మం||

పాండురంగమూర్తి - పరిమళహారతి దే
గొనుమా — వీరలక్ష్మీసన్నుత — శ్రీరంగా ||మం||

# 100

(బంతులాడెనే — పశుపతీ — సంతసమున గౌరితో) వలె.

ప॥ మంగళహారతి జే — మానినీమనోహర — జయ

అ॥ మారజనకా — గుణాభరణ కరుణించి గైకొనుమా ॥మం॥

1. మోహనమురళీధరా — మోహినీవేషధరా
మోక్షప్రదాయక నీముద్దు మోమునకు ॥మం॥

2. సత్యభామాప్రియా — సన్నుతాంగ — శ్రీహరీ
సంతసముతో నీదుపాదపద్మములకు — పచ్చలజయా ॥మం॥

3. గరుడగమన శ్రీధరా — కరుణతోను బ్రోవరా
వీరలక్ష్మీసన్నుత శ్రీ — విజయలక్ష్మితో జయా ॥మం॥

# 101

(రమారమణ గొనుమా — జయహారతి — ఇదెగొనుమా) వలె.

ప॥ హారతి — గైకొనుమా — శ్రీ — గో — పా — ల
ఇదెగొనుమా జయ

అ॥ అహల్యపావన — అవనిజాధార
సుందరహారతి — సుమతీ రుక్మిణితో ॥హా॥

1. కరివరదా — కరుణామయా — కరుణతో బ్రోవుమయా
కాళింగమడుగులో — ఘనమైన పాముపై
మర్దనజేసిన — ముద్దుల శ్రీహరీ ॥హా॥

2. మందరగిరిధర — మణిభూషణాకరుడ
మన్నుతిన్నావని — మాత దండింపంగ
పదునాల్గుభువనాముల్ — నోటజూపిన హరీ ॥హా॥

3. పురాతనపురుషుడా - బృందావనలోలుడ

పూతనసంహారక - పుండరీకాక్షుడ
మద్దులగూల్చిన — రాధన — శ్రీహరీ ||హా||

4. ఆనంద - మురళీంబా _ ఆశ్రితసంరక్షక
అమృతకలశంబు — అసురులకె చూపుచు
సురులకు నొసగిన — సుగుణాభూషణ హరీ ||హా||

5. పరమాత్మా — పాలించు — పరమాత్మునివేగ
పాంచాలి సభలోను — భంగ మొందిననాడు
అక్షయంబుగ వలు — వ లొసంగిన శ్రీహరీ ||హా||

6. గోవిందా — మురళీధర — గోపికామనోహర
గోవర్ధనముఁ ఎత్తి — గోపగోపుల నెల్ల
కరుణాతో — బ్రోచిన — వీరలక్ష్మీనుత ||హా||

# 102

(పలికింప - వేగరమ్మి - పద్మనేత్రి — సీతతో) వలె.

ప॥ హారతిదే — నైశ్వాసురా - క్షీరాబ్ధి — శయనా
అ॥ శ్రీలక్ష్మితోఁగూడి - స్వీకరింపుము - జయా ||హా||

1. సర్వలక్షణాయ - సత్యధర్మపరాక్రమాయ
సర్వేశ్వర - సర్వోత్తమ - సత్యరూప హరీ ||హా||

2. పురాతనపురుషా - పురంధర వాసా
బృందావనలోలా - పురుషోత్తమ శ్రీహరీ ||హా||

3. గోపికాహృదయాపహర - కోటిమన్మథరూప
పద్మమాలాధర - పరమపురుష హరీ ||హా||

4. రమ్యగుణాకర - రాజీవలోచనా
రమణీమోహనాకారా - రాధామనోహర హరీ ||హా||

5. నాను చేసాయు నిన్ను - దర్శింప వశమా
వీరలక్ష్మీసన్నుత - విశ్వమూర్తి శ్రీహరీ ||హా||

# 103

(నవ్వోమ్ముస్సుటి - కృష్ణమూర్తి — నీవడగలు విన్నంత) వలె.

ప॥ పరాకేలనూ - హారతిగైకొనుమా — పరమపురుష - వరదా

అ॥ ప్రాకారింపకు — నీరాజనమిదే — నిత్యసుందరాంగ హరీ ॥ప॥

1. వరనారాయణా — నటనసూత్రధర — నందునినునుకుమార
నారదవందిత — చరణములకు నే — నవనీతపుహారతు
లర్పించితి ॥ప॥

2. మురళీమోహన — ముకుంద మాధవ
ముద్దు యూరమునకును — రద్దు లేలయా
రత్నలహారతి — రమణీయ గొనుమా దేవా ॥ప॥

3. సాధువ్యాగము — సంతాపమడంచి
విజయహారతి — ఇదిగొనుమా — విశ్వమోహన
విజయభాస్కర — వేదవేద్య — వీరలక్ష్మీ ప్రసన్నతా ॥ప॥

# 104

(కేశవ నామావళి మంగళ హారతి,

(రాగ - వేణుగోపాలా — రాజితసద్గుణజయశీలా) వలె.

ప॥ హారతీ—గైకొనుమా— క్రిష్ణ—క్రిష్ణ—క్రిష్ణ—శ్రీకేశవా

అ॥ నందనందన — నరధరవందిత — నారాయణా — మాధవ
వేవేగా ॥హా॥

1. గోకులాబృందావనలోలా — గోపరిపాలక — గోవింద
విజయధరా — వినుతగుణా — విజయములొసగుము —
విష్ణువు వేగా ॥హా॥

3. అన్నవరమున — అతివలక్ష్మితో—కొండపైన వెలసియున్న
కోమలాకా—కోటిసూర్యప్రకాశా ॥ప॥
4. వీరాధివీరా—విశ్వపరిపాలా — విరలక్ష్మినస్నుత
వీరవెంకటస్వామి — కిదే హారతీ ॥ప॥

## 107

(సాకసులాస – కనుపడ వేమి — ఇంత కన్నాడ జాయుట) వలె.

ప॥ స్వీకరింపుమ — హారతి దే శ్రీసత్యనారాయణస్వామి
కూరిమితో

అ॥ ఆదిమధ్యాంతరహిత ఆనందసుందరమూర్తి-అనుదినమునూ ॥స్వీ॥
1. సత్యధర్మవ్రతాయ — సచ్చిదానందరూపకా—సనాతనాయ
సత్కృపజూపుము — సత్యాధారా ॥స్వీ॥
2. కల్యాణమూర్తి నీవెంతో - కరుణాత్ముడవని
కథలెన్నోవింటి - కమలాదళానేత్ర - కరుణజూపుమా ॥స్వీ॥
3. అన్నవరముకొండపైన - అతివలక్ష్మితో వెలసియుంటివి
అనాథపరిపాలా - ఆర్తశరణ్యా ॥స్వీ॥
4. వీరలక్ష్మిహృదయవాస - వీరవెంకటసత్యనారాయణ
స్వామి - లోపములెంచకుమా - వేగ బ్రోవుమా ॥స్వీ॥

## 108

(నను పాలింప నడచివచ్చితివో) వలె.

ప॥ పరిమళ - హారతీ - పద్మావతితో - కూడి
అ॥ శ్రీనివాసమా - స్వీకరింపుమా వేగా ॥ప॥
1. ఆదిదేవా ని - న్నాశ్రయించియుంటి
ఆనందగోవింద —ఆర్తశరణ్యా వేగా ॥ప॥

2. దీనజనులను బ్రోవగా - దిక్కు నీవేయని మదినమ్మి
యుంటిని - మనవాలకించి - మంగళా మొసగుము వేగా ॥ప॥
3. పరమమంగళమూర్తి - భవభయముహరణా
భవదీయపాదసేవా - పరమాత్మ యొసగుము వేగా ॥ప॥
4. సర్వేశ్వర విజయా - సత్యస్వరూపా
వీరలక్ష్మిహృదయవాస - చిద్విలాస - శ్రీనివాసా వేగ ॥ప॥

# 109

(రంగన్యాతకేశారె — అంగనమణి) వలె.

ప॥ హారతీ యిచ్చెదరా - రమణా - రమణా - వెంకటారమణా
అ॥ హారతీ యిచ్చెదాను - అనుదినముందున
అలిమేలుమంగకు - ఆపద్బాంధవ నిత్య ॥హా॥
1. అభయహస్తము యిచ్చి - ఆదరించితివి స్వామి
ఆశ్రయించియుంటిని - అనుదినమునను ॥హా॥
2. మంగాపురినివాసా - మణిమయాలంకార
మంగళామిదే గొనుమా - సుకుమారశరీరా ॥హా॥
3. ఏడుకొండలపైని - వెలయుచునుంటివి
ఏమనీకొనియాడుదూ - ఏలనీమహిమన్
4. శ్రీనివాసా నిన్ను - చాలా నమ్మియుంటి
వీరలక్ష్మినుత - విజయసంరక్షకా ॥హా॥

# 110

(ఏలాగు — దండింతు వీని) వలె.

ప॥ హారతీ యిదె నీకు - రమణా — రమణా —
ఆనందమూర్తి — అనుదినమునను
అ॥ దేవా దయాకర- రమణా- దీనులబ్రోచేటి- దివ్యప్రభావా ॥హా॥

1. ఎంతో మహానుభావుడవు — ఏడుకొండలపై నీవు
వెలసియుంటివిగ - ఎంతో నినువుద సన్నుతియుంటివి
వీరలక్ష్మీసన్నుత మహేశా - శ్రీ వెంకటేశా ||హా||

# 111

(భక్తజనపాలా — కరుణాకర — పావనీనమో) వలె.

ప|| హారతిదే - గొనుమా - శ్రీరమణా - వెంకటరమణా
అ|| అల్వేలుతో హారతిదే గొనుమా ||హా||

1. ఆదిమధ్యాంతములు లేక - అంతటనిండియుండిన
అఖిలాండనాయక - అనంతహారతి దేగొనుమా
శ్రీరమణా - వేంకటరమణా - అల్వేలుతో ||హా||

2. దీనబంధూ — దయాసింధూ — భక్తపరిపాలా
భరవిహార — పన్నగశాయీ — పరమాత్మ
పచ్చకర్పూరా — పరిమళా ||హా||

3. ఏడుకొండలపైన — ఎంతో వెలసియుంటివి
విజయధరా — విజయపరిపాలా
వీరలక్ష్మీసన్నుత — రమణా — రమణా ||హా||

# 112

(పాడవేరాట్నమా — ప్రణవభారతగీతి) వలె.

ప|| హారతి — గొను — రమణా — అల్వేలుమంగతో
అ|| అచ్యుతా గోవిందా — అభయప్రదాయకా ||హా||

1. దీనులపాలిటి — దిక్కు నీవేగాదే — శంఖచక్రాధర
సేవనకోరితి — దేవదేవాహారీ — దివ్యాంబరధారీ ||హా||

2. కరుణారసాభరణ — కల్యాణదాయకా
కర్పూరహారతి — కరుణించవు — కరివరద ||హా||

3. ఏడుకొండలపైన — వెలసిన శ్రీరమణా
ఎంతో నిను నమ్మితి — అంతరంగాత్మలోను
ఆనందశ — తుత్తిని — సిరబాత్మి త్తహోసు ||హా||

# 113

(ఇక సైశా - మానకేమిర - యూమాయకొలువు) వలె.

ప॥ స్వీకరింపుము-హారతీ-శ్రీరమణా-శ్రీరమణా వెంకటరమణా

అ॥ నేమాగు నిన్నే నే — నేఁచుచుంటిని
శ్రీలక్ష్మితోఁగూడి — శ్రీనివాసమూర్తి ||స్వీ||

1. అనాథనాథుడ — ఆర్తశరణ్యుడ
ఆదరింపుమయ్యా — ఆశ్రయించియుంటి ||స్వీ||

2. పద్మబాంధవ హారీ — ప్రాపుకోరీయుంటి
పరమపురుషా — వరద — పద్మావతీనాథ ||స్వీ||

3. వితరణగుణాభరణా — ఇజ సుసంరక్షకా
వీరలక్ష్మీ సహోసు — ఏడుకొండలవాసా ||స్వీ||

# 114

(శాంతములేక - సౌఖ్యము లేదు) వలె.

ప॥ పరమేశ్వరా - శంభో - పావనగుణధామా

అ॥ పరిమళ హారతిదే - పార్వతితో గొనుమా ||ప||

1. నందివాహనప్రియమా - చంద్రమౌళీశ్వరా
గంగాధరా - గౌరీ మనోహరా ||ప||

2 నానా రేడుగళములతో - మరిమరిపూజింతు

1. పరమేశ్వరా - మమ్ము - పావనులజేయుమయ్యా
పావనగుణధామా - భక్తదయాపరా ||జ||
2. కైలాసవాస శివ - నిజముతో మది నమ్మితి
కర్పూరహారతిదే - కరుణాకర - ఉమేశ్వరా ||జ||
3. వాసిగాను పినపళ్ళపురమునను - వెలసిన
నీలకంఠేశ్వరా - పార్వతీమనోహరా ||జ||
4. విశ్వేశ్వరా జయజయా - వీరలక్ష్మి నమ్మితా
వాసుకిభూషణా - సన్నిధానమున నిను ||జ||

# 117

(జాలమేల గోపాలకృష్ణ — నీ — లీలలు కనుగొనజాలరమా) వలె.

ప॥ జయహారతి - ఇదిగొను - విశ్వనాథ శ్రీ
అన్నపూర్ణ భ - వానితో జయ
అ॥ జయజయ శంకర - జయజయ శంభో
జయహారతి - దయతోగొనుమా ||జ||
1. గంగాజటధర - గౌరీశ్వరహర - గరళకంఠ మము
కరుణించు - కరుణాకర శ్రీ - కాశీవాసా - నిజముతో మది
నమ్మితిని ||జ||
2. నన్నజాజులా - సంపెంగలతో - సదాపూజించెద - సాంబశివా
దీనబాంధవా - నవ్యహారతిదే - కూరిమితో కృపజూడుము హరా ||జ||
3. మార్కండేశ్వర - మునిజనపూజిత
నీదు రూపము - నీలకంఠా
పరమేశ్వర శ్రీ - పార్వతీపతీ - ప్రార్థనవిని - పాలింపుమయా ||జ||
4. నాగభూషణా - నందివాహన - చంద్రమౌళి-నా సేవగొను
దేవదేవ హరా - జ్ఞానపోషక- దాసురాలు వీరలక్ష్మియిచ్చే ||జ||

# 118

(తార — వేణూ — గోపా — బాలా) వలె.

ప॥ శంకరా - స్వప్రకాశాయ - చేకొనుమా - జయహారతి జే

అ॥ సర్వేశా - సాంబశివా - పరమేశ్వర శ్రీ-పార్వతితో గూడి ॥శం॥

1. మునిజనసన్నుత - [illegible]ంటేశ్వర
చంద్రఫణిభృద్ధర - సేవాగొను - సర్వాత్మ
సచ్చరిత - సత్కృపజూపుము - సర్వాధార ॥శం॥

2. గణలోలా - గౌరిమనోహర - గరళకంఠ శ్రీ-కరుణామయ
కైలాసపురవాసా — కరుణన్ బ్రోవుము - గంగాజటధర ॥శం॥

3. త్రిమూర్తి రూపక — త్రిశూలపాణి
భవభయనాశన - పరమాత్మ - విశ్వేశ
విజయభవ - వీరలక్ష్మీనుత - విజయ భవానితో ॥శం॥

# 119

(మంగళం — శుభమంగళం — నందనందన — నీకుమంగళం) వలె.

ప॥ జయహారతి - ఇదేగొనుమా - సరస్వతీ - సచ్చరిత్రీ

అ॥ సతతాము నీ-చరణములను - శరణంటిని - కరుణింపుమా ॥జ॥

1. దయాంబుధి - దయజూపవే - నిన్నే నెఱనమ్మితినే
నీలవేణిరో - భక్తపోషణి - పలుకేల - గైకొనుమా ॥జ॥

2. సన్నజాజులా - చామంతులా - చాలగ నిన్నే పూజించేద
సంతతంబు నాయింటనుండుమా - ఈప్సితాఫల ప్రదాయినీ ॥జ॥

3. పద్మజుని ప్రాణసఖి - పాలింపవే - పరమపావనీ
నీదుకరుణాకటాక్షముల్ - వీరలక్ష్మిపై - వీక్షింపవే ॥జ॥

## 120

(ఎవ్వారికి బాలలార - ఎరిగింపుమా రాజాతోను) వలె.

ప॥ మంగళమిదే - గైకొను - మహాలక్ష్మిదేవిరో.

అ॥ మాధవురాణిరో - మారుజననిరో ॥మం॥

1. మల్లెపూలతోటి నన్ను - మరువరో పూజింతునమ్మ
సారసాక్షి - నన్ను తాంగి - చల్లానిదయను జూనవమ్మ ॥మం॥

2. పచ్చని స్వర్ణపూలతో - నిత్యము నను - సేవింతును
పద్మసంభవసరో - పాదపద్మములకు ॥మం॥

3. విశ్వరక్షకునీసతీ - విజయము రక్షించి
విన్నపంబు నాలకించి - వీరలక్ష్మి యిద్దినా ॥మం॥

## 121

(తొలినేజేసిన - పూజాఫలము) వలె.

ప॥ జయజయ - హారతి - జనని - భవానీ

అ॥ జయహారతిగొను - దయతో పార్వతి ॥జ॥

1. అర్ధనారీశ్వరి - అంబకాత్యాయని - పరమపావనమణి
బాలసుందరి - రక్షింపవమ్మ - రాజరాజేశ్వరి ॥జ॥

2. నీచరణములకు - నిత్యమల్లెలతో - పూజించెదనమ్మ
పువ్వుబోణిరో
గరళకంఠునిసతి - గౌరిమహావాహి - కనికరింపుమా - వీర
లక్ష్మి యిచ్చే ॥జ॥

## 122

(రామకృపాకర - రఘుకులశేఖర) వలె.

ప॥ మంగళహారతీ - మహాలక్ష్మి గైకొనుమా

అ॥ మానినీమణిరో - మరువాక బ్రోవుమా ॥మం॥

1. కమలబాంధవీ - కల్యాణదాయినీ
కమలలోచనీ - కరుణింపుమా - జననిరో ॥మం॥
2. మంగళస్వరూపిణి - మధురసుభాషిణి
మానసనంచారిణీ - మనవాలకింపుమా ॥మం॥
3. రేఖవర్ధనములతో - రోజూ ప్రాణి చెద
లోపము లెంచకమ్మ - లోకసంరక్షిణీ ॥మం॥
4. జగదేకపూజిత - శరణంటె బ్రోవుమా
జననీ నీ పదములకు - వీరలక్ష్మి యిచ్చినా ॥మం॥

# 123

(నందనందనా - నను- బ్రోవుమా)వలె.

ప॥ మంగళం జయ - మంగళం - శుభమంగళం - మహాలక్ష్మికి
అ॥ మంగళం మాధవుసిరాణికి - మంగళం శుభాంగికీ ॥మం॥
1. నిత్యమల్లెలు - పచ్చగులాబిలు - నిత్యము పూజింతు నే
నీరజాక్షి జాలమేలనె - నీకృపా జూపవమ్మ ॥మం॥
2. పద్మబాంధవీ - ప్రాపుగోరితి - పాలించి దయజూడవే
విజయలక్ష్మిరో - వీరలక్ష్మికి - విజయము లొసంగుమా ॥మం॥

# 124

(ఇక నేమందు - నె చెలియా)

లేక

(మంగళంబు-యదుపుంగవా) వలె.

ప॥ హారతి - యిచ్చేదను - సీతామహాలక్ష్మికి - శ్రీరాముపత్నికి
అ॥ హారతి గొనవమ్మా - ఆనందరూపిణి
ఆదరింపవమ్మ - అనుదినమును జయ ॥హా॥

1. పచ్చగులాబీలు - పారిజాతాలతో
నిత్యము పూజింట - శ్రీరాజపుత్రికి ||హా||
2. కురువేసు దమనము - కుంకుమలతో పూజింతు
అచ్యుతునిరాణికి - మంగళరూపిణికి ||హా||
3. భూదేవిపుత్రికకు - పుష్పోత్తమునిసతికి
వీరలక్ష్మి బ్రోచు - రాజరాజులక్ష్మికి ||హా||

# 125

(సదినాలందరు — కస్తూరీ—వయ్యారముగను)వలె.

ప|| తల్లీ - నీకిదే - హారతి - సీతమ్మతల్లీ - దేవినీకిదే - హారతి
అ|| మానససంచారిణి - మంగళస్వరూపిణి
పొంగుచు నీపాదములకు - పూజించి యిచ్చేదా ||త||
1. పద్మనాభుని చేడెరో - పరమపావని లక్ష్మిరో
పచ్చలాహారతి నీకు - భక్తితోను ఇచ్చేదా ||త||
2. విష్ణునీ - వక్షంబునా - విమలముగ నివసించెడి
వినీలావేణిరో - వీరలక్ష్మినన్నుగాా ||త||

# 126

(జయజయ — హారతీ — జననీ — పార్వతీ) వలె.

ప|| మంగళహారతీ - మహాలక్ష్మి నీ కిదె
అ|| ఇందిరారమణుని - సుందరవదనాకు ||మం||
1. కమలదళానేత్రి - కల్యాణదాయకి
కమలగర్భునిసతి - కరుణింపుమా జననీ ||మం||
2. లోకసంరక్షణి - లోపము లెంచకుమా
ప్రాపుగోరితినమ్మ - పాలింపుమా జననీ ||మం||

3. దీనజనావనీ - [illegible]
వైకుంఠవాసినీ - వీరలక్ష్మి [illegible] ॥నం॥

# 127

(సర్వమంగళనామా - సీతారామా) వరె.

ప॥ జయ హారతీ - [illegible] - [illegible] - సీతా
అ॥ జనకపుత్రీ - [illegible] - [illegible] ॥జ॥
1. మనవిగొనుమా - మంగళాంగి - మానసుజనీ
పూజగైకొను - బ్రోవుమమ్మా - [illegible]వదనా ॥జ॥
2. నిన్ను [illegible] - [illegible]రో
పద్మబాంధవి - పరమపావని - [illegible] ॥జ॥
3. లోపములు [illegible]నెంచకు - [illegible] సీతా
వీరలక్ష్మినన్ను [illegible] - విజయలక్ష్మిరో ॥జ॥

# 128

(బాలరావే - పూలనీవు - భూపాలమాలిని జూడుమా) వరె.

ప॥ కనకదుర్గ - నీకు జయమా - కర్పూరహారతిదే
అ॥ కమలలోచని - కన్నతల్లి - కరుణజూపు - కాత్యాయనీ ॥క॥
1. పరమపావని భక్తపోషణి - పచ్చలాహారతిదే
భావమందు నీదు - పాదపూజచే సెదభక్తితో ॥క॥
2. దుర్గమాంబ - దురితహారిణి - మంగళస్వరూపిణీ
మానసానంచారిణీ నిన్ - మదిని నమ్మియుంటినీ ॥క॥
3. శారదాంబ - శక్తిరూపిణి - సద్గుణమణి బ్రోవుమా
నీలవేణీ - నిరుపమాన - నిత్యజయహారతీ ॥క॥
4. వాసిగా బెజవాడపురమున - వెలసితివి కొండపై
దాసురాలగు వీరలక్ష్మినిసి - దయతోను రక్షింపుమా ॥క॥

## 129

(వ్రాజను నేయుగాకే — పుండరీకాక్షునకు) వలె.

ప॥ మంగళహారతిదే - రాణి - కల్యాణిగైకొనుమా .

అ॥ చంద్రవదనాల్లీశ్వరి - వేడెరో గైకొనవే ॥మం॥

1. పరమపావనమణి - పన్నగశయనిరో

పచ్చకర్పూరంపు - పరమళహారతి దే ॥మం॥

2. దేవదేవుని రాణి - దేవిమీనాక్షిరో

నారీశిరోమణి - నలినాక్షి - శ్రీపార్వతీ ॥మం॥

3. అర్ధనారీశ్వరీ — అంబ కామాక్షి

వీరలక్ష్మీనన్నుతా - విజయసంరక్షణి ॥మం॥

## 130

(చలియా - యౌవనములో - చెండ్లను) వలె.

ప॥ హారతీ - గైకొనుమా - అంబ పర్వతవర్ధనీ

అ॥ శంభునిరాణి నినూ - సన్నుతిజేసెదనే ॥హా॥

1. మోక్షప్రదాయినీ - మ్రొక్కివేడితినమ్మా

మోదముతో నీకు — ముత్యాలహారతి జే ॥హా॥

2. రాజరాజేశ్వరీ - రాజితగుణమణి

రాకేందుబింబాననా - రక్షింపవే జననీ ॥హా॥

3. వాసిగ - పినపళ్ళపురమున నిలసిన - నీలకంఠునీసతీ

అంబ శ్రీపార్వతీ ॥హా॥

4. నిఖిలలోక పావనీ - నిన్నె నెఱనమ్మితినీ

నీరజాదళ నేత్రి - వీరలక్ష్మీసన్నుతా ॥హా॥

# 131

(ఎంతో చీదబాడమ్మా - గోపాలకృష్ణుడు) వలె.

ప॥ హారతి - గైకొనవే - గౌరి [illegible] శ్వరి

అ॥ అంబా త్రిపురసుందరి ॥హా॥

1. హిమవంతునిపుత్రి - యీశ్వ[illegible]పత్ని
యీప్సితఫలము - [illegible] వే ॥హా॥

2. పూర్ణేందువదనరో - పూజింతు చరణముల్
కరుణించి బ్రోవుమా - గానలోల జననీ ॥హా॥

3. అన్నపూర్ణ నిన్ను - ఆశ్రయించితిమంటిని
తారకనామప్రియా - దయతోను బ్రోవవే ॥హా॥

4. వాసిగపినపళ్ళపురమున - వెలసిన
నీలకంఠునిసతి - అంబ శ్రీపార్వతీ ॥హా॥

5. నిఖిలలోకమాత - నిన్నే నమ్మితినమ్మ
వీరలక్ష్మి నియిచ్చే - విజయమంగళ జయము ॥హా॥

# 132

(రారా వేణుగోపా - బాలా - రాజితసద్గుణ - జయశీలా) వలె.

ప॥ చంద్రమౌళీశ్వరుని రాణి — చేకొనుమా — జయహారతి దే

అ॥ శాంతరూపిణీ — శర్వాణీ — హిమవంతునిపుత్రి - ఈశ్వరీ ॥చం॥

1. కుంకుమాంకురవేసులతోను — కుందరదన నిను పూజింతు
కూరిమితో - కృపజూపు - రాజితగుణమణి - రాజరాజేశ్వరీ ॥చం॥

2. దేవదేవి — దివ్యవాసిని - మంగళరూపిణి
మనవిగొని - కరుణింపు — కల్యాణి — విజయహారతి —
వీరలక్ష్మినుత ॥చం॥

2. ఆనందసంధాయినీ - ఆదరింపవే తల్లీ
అతులితమహింపాదము - భక్తి నాకొసగుమమ్మా ||బా||
3. సర్వార్థవర్ధనీ - పాలించవే జననీ
సిరలక్ష్మీప్రకాశినీ - విజయసంరక్షణీ ||బా||

# 138

(బాలరాజ - పూలనీవు - భూపాలవకాళిని జూడుమా) వలె.

ప|| హారతీ - గైకొనుమా - అంబా - అన్నపూర్ణభవానిరో
అ|| లోపములు మది నెంచకమ్మా - లోకపూజితపావనీ ||హా||
1. సత్యవాణి - సద్గుణామణి - సారసాదళలోచనీ
చల్లనీదయజూపవమ్మా - సత్యలోకనివాసినీ ||హా||
2 నాసిగా పినపుకృపురమున - వెలసియుంటివి - పార్వతీ
నీలకంఠుని సఖియరో - రామనామపిపాసినీ ||హా||
3. విశ్వనాథునిరాణిరో నా - విన్నపంబాలించుమా
వీరలక్ష్మీప్రసన్నతాంగీ - విఘ్ననాథునిజననిరో ||హా||

# 139

(ఎంతో బీదవాడమ్మా - గోపాలుడు) వలె.

ప|| కర్పూరహారతి దే - హిమగిరిబాలా - కరుణాతో గైకొనవే
అ|| కైలాసవాసినీ - అంబ - కాత్యాయనీ
సాంబశివునిసఖియరో - సన్నుతించెద జననీ ||క||
1. రాజరాజేశ్వరీ - రాజీవలోచనీ
రాకేందువదనా మము - రక్షించవే జననీ
2. పర్వతరాజకుమారీ — పరమమంగళగౌరీ
పాలించి బ్రోవుమా - పరమపావనజననీ

3. గులాబి కురువేరు - కుంకుమతో పూజిస్తు
కూరిమితో కృపజూపుమా - కుమారునీజననీ ॥క॥
4. వీనీల వేణిరో - విజయసంరక్షణి
విన్నపం బాలింపూ - వీరలక్ష్మీయిచ్చే ॥క॥

# 140

(తగునా — జాలిచెందగా — నాతండ్రి — కన్యాగానమిచ్చితరియించు) వలె

ప॥ హారతి-గైకొనుమా-శ్రీఅల్వేలుమంగరో-రమణుని రాణిరో
అ॥ హారతి - ఇదేగొనుమా - ఆనందరూపిణి
శ్రీనివాసుని చెంత - చేరియుండినలక్ష్మి ॥హా॥
1. పరమపావనామణి నీ - పాదపద్మములకు
భక్తితో పూజింతు - వరాకేలనమ్మా
పద్మసంభవనిరో - పాలించుమయతోను - పచ్చకర్పూరంపు ॥హా॥
2. మంగాపురవాసినీ - మామన గాలకింపుమా
మధురనుభాషిణి - మారునిజననిరో
మంగళనాయకి- మంగళమొసగుమా - వణిమయభూషణీ ॥హా॥
3. గోవిందునిసఖయరో - కోరినవరమిమ్మా
కోమలాంగణిరో సిన్ - కొని గాఢతరమానే
వీరలక్ష్మీనుత - విజయా - జయలక్ష్మిరో ॥హా॥

# 141

(మంగళంబిదే — మాధవా — మురారి) వలె.

ప॥ హారతివ్వరే — సావిత్రి దేవికి
అ॥ హారతివ్వరారే - అతివలెల్ల మీరు

ఆనందరూపిణికి - అనుదినమును జయ ||హా||

1. వరమంగళాంగి - పద్మదళనేత్రి
పాలించే తల్లికీ - పచ్చాలహారతీ
పణతులారా మీరు - భక్తితోను జయ ||హా||

2 సత్యవంతునిపత్ని - సావిత్రికి - సద్గుణమణికి
సఖియులార మీరు- ముత్యాలహారతీ- మోదముతోను జయ ||హా||

3. నిఖిలజనావని - నిండుచంద్రముఖి
నిరుపమ గుణనిధికి - నీలవేణులార - నీరాజన జయ ||హా||

4. మంగళాంగి శ్రీ - మహిమగలతల్లి
మంగళహారతీ - మగువలారా - మీరు
వీరలక్ష్మిని బ్రోచే - విజయలక్ష్మి దేవికి ||హా||

# 142

(దొరకెనమ్మ — వెన్న — దొంగమాచేతిలో) వలె.

ప|| హారతి - గొనవమ్మ - శ్రీలక్ష్మి - తులసెమ్మ
అ|| అద్భుతునిరాణి - అనుదినమ్మును జయ ||హా||

1. ఆశ్రయించియుంటి - అమ్మా - బృందావనీ
దురితాపహారిణీ - తులసి జగజ్జననీ ||హా||

2. వెన్నలు కొమ్మలు - పన్నెదళంబులతో
వెలయుచునుంటివి - వృక్షస్వరూపిణీ ||హా||

3. చేకితి నీపద - సేవకై నిరతము
చేకొని బ్రోవుమా - జలజనయనునిసతీ ||హా||

4 విజయసహోదరి - వైకుంఠవాసిని
విన్నపంబాలింపు - వీరలక్ష్మియిచ్చే ||హా||

# 143

(ఏమిరా - పట్టాభిరామా - ఎందుకలిగినావురా) వరుస.

ప॥ హారతీ - గైకొనవే - తులసీ - అమ్మ బృందావనీ

అ॥ అనుదినంబును నిన్ను - యెంతో - ఆశ్రయించియుంటినే ॥హా॥

1. లోపములు మది నెంచకమ్మా - లోకపూజిత పావనీ
శరణు శరణు - నీకు జననీ - సేవయొనగి బ్రోవుమా ॥హా॥

2 నిత్యమూ - పూజింతునమ్మ - నీకృపవీక్షింపవే
నిత్యము - నీచరణభక్తి - నిరతమూ - నొసగవే ॥హా॥

3. రాము లక్ష్మీనామములతో - రంజిల్లుచుంటివి
పరమపావని నీపదములు - పన్నిట సేవించెదా ॥హా॥

4. మంగళప్రదాయినీ - మహిమగల తల్లివి
మరునాక మముబ్రోవుమమ్మా-మాధవుని ప్రియసఖ మరో ॥హా॥

5. వెన్నెలమతి గొమ్మలతో - వన్నెదళంబులచే
వాసిగ విన్నా - వారింట్లో వర్ధిల్లుచుండుమా ॥హా॥

6. వృక్షస్వరూపిణివి - విజయసంరక్షణి
విన్నపంబాలింపు - మమ్మా - వీరలక్ష్మీనన్నుతా ॥హా॥

# 144

(ఎపుడు కృప - గల్గునో - ఇనకులాతిలకా నీ) వలె.

ప॥ హారతి - యిచ్చెదా గైకొను - శ్రీరామా

అ॥ అతివసీతమ్మతో - అనుదినము జయ ॥హా॥

1. రాతినాతిగ జేసి - రమణిని బ్రోచియు
శివునివిల్లువిఱచి - జనకుని మెప్పించి
జానకిని పెండ్లాడినా - జయజయరామునకు ॥హా॥

2. భార్గవుగర్వము - భంగముజేసిన

పరమకృపాకర - పద్మహారాధరా
పాలించి బ్రోవుమా - పట్టాభిశ్రీరామా ||హా||

3. నీరజనాభ నీకు - నీరాంజనంబిదే
నిత్యమంగళరూపా - నీలమేఘశరీరా
వీరరాఘవ సన్నుత - విజయాసురరామా ||హా||

## 145

(ఆటసెలార - మార - లెపుడు - వచ్చినారండీ) వలె.

ప|| అమ్మా - సీతమ్మా - ఇదె హారతి - గొనుమా
అ|| అనయము - నిను వేడుచుంటి - ఆదరింపుమామా ||అ||

1. దశరథరాముసతి - జనకజనరపుత్రి
కమలనేత్రి - కావవమ్మ - కందర్పజననిరో ||అ||

2. నమ్మియుంటినమ్మ - నిన్ను - నారీమణిరో
జాగుసేయక - బ్రోవుమమ్మా - జానకమ్మారో ||అ||

3. పరమపావని - పద్మబాంధవి - పాలబడితినే
అభయమిచ్చి బ్రోవుమమ్మ - ఆదిలక్ష్మిరో ||అ||

4 తల్లి - సుగుణకల్పవల్లి - తడవుసేయకుమా
వీరలక్ష్మినని బ్రోవుమమ్మ - విజయలక్ష్మిరో ||అ||

## 146 .

(ఏల - గోపాల - ఈలీలా - పొరుగిండ్లకేగ) వలె.

ప|| బాలా - గోపాలక్రిష్ణ - పరమాత్మ - మురళీధరా
అ|| పచ్చ - కర్పు - రంపు - హారతి - తీదే ||బా||

1. భవదీయపదములను - భక్తితో సేవించెదను
ఘనుడవు - నను - కృపగనరా - కల్యాణగోపాల క్రిష్ణ ||బా||

2. నిర్మలరూప - నిన్ను - నిరతము నామదిని తలతు

నిరుపమకరుణాకర శ్రీ - నీలవర్ణ జాలమేల క్రిష్ణ ॥బా॥
3. ఎంతో నిను - నమ్మియుంటి - యాదవకులమణిభూషణ
యెంతరినో బ్రోచినావు - యశోదానంద క్రిష్ణ ॥బా॥
4. మాధవ - మధుసూదనా - మంగళప్రదాయకా
మంతిపుష్పపూజలేలా - మనోపుష్పమర్పించెద క్రిష్ణ ॥బా॥
5 మునిజనపరిపాలకా - మోహనమును జూపరా
మ్రొక్కి వేడుచుంటినిరా - వీరలక్ష్మిసన్నుత క్రిష్ణ ॥బా॥

## 147

(సత్యభామా - కోపమేలని - నిన్ను చాలా వేడెదను సఖా) వలె.

ప॥ జయహారతిదే - గైకోను - జగదేకమోహనా క్రిష్ణా
అ॥ పదహారువేల - భామామణులనెల్ల - పాలించి యేలిన
పరమాత్మ - మురళీధర ॥జ॥
1. సనకసనందన - మునిజనసన్నుత - సర్వేశా
సత్యప్రియా - హరీ - సద్గుణభూషణా ॥జ॥
2. ఉత్తరగర్భములో - నున్నశిశువును గాచి
పాండవులను బ్రోచిన - భక్తదయానిధే ॥జ॥
3. రాధాహృదయలోలా - రాజగోపాలా
దీనాజనపరిపాలా - దివ్యమంగళమూర్తి ॥జ॥
4. నిరుపమసౌందర్య - నిత్యానంద - మురారీ
వీరలక్ష్మిహృదయవాస - చిద్విలాసా ॥జ॥

## 148

(శ్రీపాండురంగస్వామీ - జాలైనలేదా - సామి) వలె.

ప॥ కర్పూరహారతి దే - గైకొనుము - సీతారామా
అ॥ గైకొను - సీతారామా - కౌసల్యాసుకుమారా ॥క॥

1. పావన తారకనామా - పాలింపు దశావతారా
పరమాత్మ - కరుణాలోలా - పట్టాభిసీతారామా ||క||
2. కౌస్తుభ మణిధర - కరుణింపు సీతానాథా
కాచియుంటిన సూర్య - కల్యాణశ్రీరఘురామా ||క||
3. సాధుహృదయనివాసా సరసాక్ష - శౌరి - ముకుందా
సత్యపాలన - మురారీ - సర్వేశ్వర - శ్రీరామా ||క||
4. మాయామానుష దేహా - మాధవ - మానరక్షణ
మఱిమఱి వేడుచుంటి - వీరలక్ష్మీసన్నుత రామా ||క||

# 149

(అబుతేరశివా - కానుమేరే - క్రిష్ణకినయ్యా) వలె.

ప|| వే-వేగమే - రారా - వేవేగమే - రారా - నందబాల
మురళిక్రిష్ణయ్యా

అ|| జగదేక మోహనాకార - హారతిగొనరా ||వే||

1. కరిరాజవరదగోపాలా - భక్తవిలోలా
నిన్నే మదినీ - నమ్మితి - నీలవర్ణక్రిష్ణయ్యా
జాలమదేల - చేసేదవుర - గరుడవిహారా
కర్పూరహారతి దే - కరుణతో గొనరా ||వే||
2. గోపి కామానసహర - గోకులబాలా
గోవర్ధనగిరిధారీ - కోమలహృదయా
తులసీవనమాలధరా - బృందావనలోలా
తుంబురగానలోలా - శృంగారక్రిష్ణయ్యా ||వే||
3. ప్రహ్లాదభయనివారవో - పావనమూర్తి - పరమాత్మాద శ్రీ
కరుణాకర - ప్రార్థనవినుమా - దేవాదిదేవా - దీనబంధూ
ద్వారకవాసా - వీరలక్ష్మీసన్నుత శ్రీ - విజయగోపాలా ||వే||

## 150

(గజ్జలంచెలు – (హాయ కృష్ణా — రార) వలె.

ప॥ హారతిగైకొనవేలా - క్రిష్ణా - ఆనంద మురళీలోలా

అ॥ ఎక్కడనుంటివి - ఎంతసిపిలచిన - రావేలా గోపాలా ॥హా॥

1. యమునాతీరము కేగినావా-లేక-యాదవులయిండ్లనుండిరావా
ఎక్కడనుంటివి చక్కనికృష్ణయ్యా - ఏలా జాలముకృష్ణా ॥హా॥

2. మందగిరి కేగినావా - లేక - మధురాపురి కేతెంచితివా
మాధవగోవిందా-మంగళనామద-మాననునాదయరావా క్రిష్ణ ॥హా॥

3. గోకులంబున కేగినావా - లేక - గోపాంగనలతో నుంటివా
రాధామనోహర- రమ్యగుణాకర - రత్నాలహారతి దేక్రిష్ణా ॥హా॥

4. వటపత్రశయనుడవై తీవా - లేక - వైకుంఠపురమున కేగితివా
వనమాలికాభరణా-వసుధసంరక్షక- వీరలక్ష్మీ సన్నుతక్రిష్ణా ॥హా॥

## 151

(జయ—జయ వైష్ణవి – దుర్గే— అంబా) వలె.

ప॥ జయజయా - హారతిగొనుమా — ఆ, ఆ, ఆ, క్రిష్ణా

అ॥ జయజయా - గోకులబాలా - క్రిష్ణా ॥జ॥

యదువంశకులదీపా- క్రిష్ణా - భూతహృదయనంతాపా క్రిష్ణా
వటపత్రదళశయనా - క్రిష్ణా - వామనరూపా - పావనక్రిష్ణా ॥జ॥

పూతనజీవితాపహారా - క్రిష్ణా- దుష్టకంసనంహారా - క్రిష్ణా
గోవర్ధనసుధీరా-క్రిష్ణా- సుజనతోష-రాధాలోలా- క్రిష్ణా ॥జ॥

సామజగోపాలా - క్రిష్ణా - శంఖచక్రగదధారీ - క్రిష్ణా
దీనదయా- దేవా- క్రిష్ణా- దేవదేవా- బ్రోవరావా-క్రిష్ణా ॥జ॥

4. ద్వారకాపురవాసా-క్రిష్ణా- దోషరహిత- కరుణాలోలా- క్రిష్ణా
నవనీతచోరా-క్రిష్ణా-వీరలక్ష్మీ హృదయవాసా క్రిష్ణా ॥జ॥



సరస్వతి, ... జ. 11 (22–12–47) 4640